అని సనత్కుమారసంహితయందును.

శ్లో॥ బ్రాహ్మణంక్షత్రియంవాపి వైశ్యంశూద్రమథాపివా।
యంవాకంవాపివాబ్రహ్మన్ శివభక్తిపరాయణం।
యోగక్షేమావదేశాద్వైర్యశ్వాసయేదతంయత్నతః।
యావత్సవసతేతత్ర తావత్తత్ఫలమస్యవై॥

అని కాశీదర్పణ గ్రంథమందును.

ఉన్నదిగావున నేకొందరుపుణ్యశీలురు ముముక్షువులైనవారికి।
తగినజీవనముగలిగించి శ్రీకాశిలోనివసింపజేయుచున్నవారు॥
ఇదిగాక॥ జీర్ణోద్ధారము శివలింగాదిప్రతిష్ఠ శ్రీకాశిలో జేయువారిపుణ్యమింతంతయని చెప్పనలవికాదు॥
పిపీలకాదిసమస్తప్రాణులకు శ్రీకాశిలో ప్రాణోత్క్రమణవేళను శ్రీవిశ్వేశ్వరుడుకుడిచెవిలో తారకోపదేశంబొనర్చుననియు అట్టిపో ప్రాణియును ముక్తినొందుననియు శ్రుతిస్మృతీతిహాస పురాణాదులయందున్నది నప్రమాణములతో ఇందునుగురించి శ్రీసురేశ్వరాచార్యులువారు శ్రీకాశీమృతిమోక్షనిర్ణయపత్రికను వ్రాసియుండిరి వలయువారలందేచూచిసంతసించెదరు॥

౧ సానందమానందవనేవసంతమానందకందం హతపాపబృందమ్।
వారాణసీనాథమనాథనాథం శ్రీవిశ్వనాథం శరణంప్రపద్యే॥
౨ ఆత్మాత్వంగిరిజామతిఃసహచరాః ప్రాణాఃశరీరంగృహం।
పూజాతేవిషయోపభోగరచనానిద్రాసమాధిస్థితిః।
సంచారఃపదయోఃప్రదక్షిణవిధిఃస్తోత్రాణిసర్వాగిరోయద్య।
త్కర్మకరోమితత్తదఖిలంశంభోతవారాధనమ్॥
౩ కరచరణకృతంవా కాయజంకర్మజంవాశ్రవణ।
నయనజంవామానసంవా పరాధమ్।
విహితమవిహితంవాసర్వమేతత్క్షమస్వ।
జయజయకరుణాబ్ధే శ్రీమహాదేవశంభో॥

౧ క్షత్రత్రాణకరీమహాభయకరీమాతాకృపాసాగరీ।
సాక్షాన్మోక్షకరీసదాశివకరీవిశ్వేశ్వరశ్రీధరీ।
దక్షాక్రందకరీనిరామయకరీకాశీపురాధీశ్వరీభిక్షాందేహి।
కృపావలంబనకరీమాతాన్నపూర్ణేశ్వరీ॥

కా శీ క్షే త్ర మ హి మ

సంపూర్ణం.





## శ్రీ గయా గదాధర మహాక్షేత్రము.

గయ ఫల్గునీనదికి పశ్చిమతీరమునందున్నది సదరునది అంతర్వాహినైయున్నది శ్రీరాములవారుగయకువచ్చినప్పుడు ఋతుమతియైనసీతాదేవిఫల్గునీతీరమునందుకూర్చుండి యిసుకయుండలుచేసి పిండప్రాయముగానుంచినందువ క్షేత్రప్రభావముచేత దశరథాదిపితృదేవతలకుతృప్తియై పిండదానముచేయునప్పుడు నాటిసదాచారమునుబట్టి దశరథుడు ప్రత్యక్షముకాకుండెనట కారణమేమని శ్రీరాములు చింతించి ప్రార్థింపగా యిసుకపిండములతో దశరథుడు ప్రత్యక్షమయ్యెనని అందుకు శ్రీరాములువిచారించి యీపనియవరికృతముగా జరిగెనని సీతనడుగగానే నెరుంగనని సీతయనెనట తర్వాత ఫల్గునియొద్దకువచ్చి సీతయిసుకపిండములుపెట్టి నావేదానికి ము చెప్పుమని శ్రీరాములడుగగా ఫల్గునిజరిగినదిరుజువుపడెనట అప్పుడు శ్రీరాములుక్షమాపణపూర్వకముగా ప్రార్థింపగాదశరథుడుశ్రీరామదత్తపిండములు ప్రత్యక్షముగా స్వీకరించి తృప్తిజెందెనట ఇప్పటికిఫల్గునీ పూర్వతీరమందు సీతావిగ్రహంబును నిశరాపిండయుక్తమైన దశరథహస్తంబును తగుపాటిమందిరములోనున్నవి।

నీవుస్త్రీవైయుండియును స్త్రీమర్మమునుదాచక బయలుపెట్టితివి గనుక అంతర్వాహినివౌదువుగాకయని సీతాదేవి శపింపగానదిఫల్గుని నదినాటనుండి అంతర్వాహినియయ్యెనని॥

అంతర్వాహినియనగా వృక్షమునగదిబ్బగానేయుండిలోపుకుంచి నీరు ప్రవహింపుచుండు నువర్షాకాలములో వర్షములయొక్క యత్కాపాశ వకవర్షములనుబట్టి తత్తుల్యముగా కొన్నిదినములే ప్రవహింపుచుండునుదీ నికి పెక్కుఘట్టములున్నవిగాని యతుచారము గానున్నందునను వానివిని యోగము లేనందునను పేళ్లు వ్రాయలేదు॥

యాత్రికులులేమశక్తిననుసరించియీగయలో అష్టగయలు పంచ గయలు ఏకోద్దిష్టము చటకముమాతృగయ జరిగింపుచుందురు ఇన్నిటిలో నూ శ్రీవిష్ణుపాదముముఖ్యమైయున్నది అదిగొప్పమందిరములో చద రమైనకుండములోనునుపుగా మూరెడుపొడవుగా కుడిపాదమున్నది దీ నినే శ్రీవిష్ణుపాదమందురు దీనిమీద పిండముపేటివరకువుండలేదని ఈగు డియావరణమంతయు గయునిశిరస్సనిచెప్పుదురు భూమికిన్నరెండునిలువ్వ లు రొుత్తుగానున్నది శ్రీవిష్ణుపాదమున్నగుడియొక్కసన్నిధి మంటపములో ప్రాగ్దక్షిణాంతరాళకోణమందు ఈశాన్యాద్యష్టాదశపాదములున్నవి అవి శ్రీవిష్ణుపాదమువలె స్ఫుటముగాకనంబడలేదు ఎరిగినవారు గురుతులుకన బరచి వానిపైని పిండదానముచేయింపుచుందురు॥

| | |
|---|---|
| ౧ ఈశానపాదము | ౯ క్రౌంచపాదము |
| ౨ విష్ణుపాదము | ౧౦ ఇంద్రపాదము |
| ౩ బ్రహ్మపాదము | ౧౧ దధిపాదము |
| ౪ కహారస్వపాదము | ౧౨ కన్యాపాదము |
| ౫ త్రేతాగ్నిపాదములుమూడు | ౧౩ మతంగపాదము |
| ౬ సూర్యపాదము | ౧౪ సభ్యావసభ్యపాదము |
| ౭ చంద్రపాదము | ౧౫ అగస్త్యపాదము |
| ౮ గణపతిపాదము | ౧౬ కశ్యపపాదము |

అనియీపేర్లుగలయీయష్టాదశపాదములుగయునిశిరస్సనందుం చిన కారణము గయామహాత్మ్యాదిగ్రంథములవలననే తెలిసికొనవలయును॥

ఆర్యావర్తాంతర్గతమగధదేశేచంపకారణ్యే । మధువనేకోలాహలప ర్వతే।గయాగదాధరక్షేత్రె విక్రమశకే। బౌద్ధావతారేస్త్రింశ త్కోటిదేవతా।బ్రాహ్మణహరిహరగురుచరణసన్నిధౌ॥

అనియచ్చట సంకల్పముచెప్పుచున్నారు॥

అక్షయవట శ్రాద్ధానంతర మందు శాస్త్రార్హ్యులై నక్షయగయాముఖునయిన అం ద్రోణదానినయినను తత్ప్రీతిగా స్వాభీష్ట పదార్థములలో శాక-ఫలములను రెంటినయినను విడిచిపెట్టుమనగ యాత్రికులు చెప్పుదురు యాత్రికులు తమ యిష్టానుసారము జరిగింపుచుందురు గయకు పడమరగా మైళ్ళదూరము లో అక్షయవటమున్నది దీనిక్రింద పిండ దానము చేయించి-గయావళీలు-సుఫలము త్తురు-పితురు ప్రీతికై వీరిసంతసింప జేయుదురు.

అష్టగయలు వివరములు.

౧ ఫల్గునీ శ్రాద్ధము
౨ ప్రేతపర్వతమునందు శ్రాద్ధము — ౪ మైళ్ళదూరములో నున్నది
౩ రామపర్వతమునందు — డిటో డిటో
౪ ధర్మారణ్యములో — ౩ మైళ్ళ దక్షిణదిక్కుగా
౫ బోధగయలో — ౫ మైళ్ళదక్షిణదిక్కుగా
౬ అష్టాదశపాదము — ౧౮ పీఠములతో వుండి అచ్చటచ్చట పిండదానము చేయవలెను.
౭ విష్ణుపాదముపై నిపిండములు పెట్టుట
౮ అక్షయవటము క్రిందను

విష్ణుపాదమున్న మందిరమునకే శాన్యముగా శ్రీగదాధరస్వామివారి మందిరమున్నది దానికెడమగ విష్ణుపాదమునకు పోవుత్రోవలో శిలా రూపమైనగద యున్నది ఈగదకు నెయిరుతిగా గాయత్రీపర్వతమున్నది దానిశిఖరమందున్న గాయత్రీదేవిని దర్శించి ౧౦ మార్లు గాయత్రీమంత్రము ను జపించినను పునర్జన్మరహితుడగును సహస్రము గాని లక్షగాని జపించి నవారిఫలము చెప్పనలవికాదు.

శ్లో॥ కీకటేషుగయాపుణ్యా నదీపుణ్యా పునఃపునా। అని వాయుపురాణ ములో జెప్పినచొప్పున కీకటదేశములయందు గయపుణ్యస్థలమనియు పునఃపు నానదిపుణ్యస్వరూపిణియనియు ప్రసిద్ధిగనున్న గయకు ౪ మైళ్ళదూరము లోనున్న పునఃపునానదియొద్ద తీర్థశ్రాద్ధము చేయించుదురు దీక్షవహించి గయకువచ్చుట యాచారముఖ్యమున్నది గయాక్షేత్రమునకు యీనదికి

కీకటదేశమనగా దయాదాక్షిణ్యధర్మకర్మశూన్యములైన మగధదేశములని తాత్పర్యము.

పితృఋణవిముక్తికై గయలో పిండదానముచేయుట ముఖ్యమని యనేకగ్రంథములందు చెప్పబడియున్నది,

౧ ధీరనగో స్తుథమణి హరవనను మేఘసన్నిభాకారవనకః।
ఘోరాసురహరణసహాయిరవనకునుయుపనిపత్పురవిహారవనకః॥

౨ పుణ్యవనకును మునినివహాశరణ్యవనకు ననంగకోటిరాజత్తనులా।
వణ్యవనకు నిగమమస్తకగణ్యవనకుసహైతుకారుణ్యవనకః॥

## గయాక్షేత్రమహిమ

సంపూర్ణము.





## శ్రీ ప్రయాగ మహాక్షేత్రము.

౧ తీర్థరాజప్రయాగస్య మాహాత్మ్యం కథయిష్యతి।
శృణ్వాతః సతతం భక్త్యా వాంఛితం ఫలమాప్నుయాత్॥

౨ సురమునిదితిజేంద్రైః సేవ్యతేయో స్తతంద్రైర్గురుతర।
దురితానాం కాకథా మానవానామ్।
సభువి సుకృతకర్తుర్వాంఛితావాప్తిహేతుర్జయతి।
విజితయాగస్తీర్థరాజః ప్రయాగః॥

౩ పుర్యశ్శిరస్త్రప్రసిద్ధాః ప్రతివచనకరీస్తీర్థరాజస్యనారీయో నయి।
కట్యాంన్ముక్తిదానే ప్రభవత్యనుగుణా కాశ్యతే బహ్మాయుస్యామ్।
సేయం రాజ్ఞప్రదానప్రియవచనకరీ ముక్తిదానేనయుక్తా యే।
సబ్రహ్మాండమధ్యే సజయతి సుతరాం తీర్థరాజప్రయాగః॥

౪ సితాసితే యత్రతరంగచామరే నద్యౌ విభాతే మునిభానుకన్యకే।
లీలాతపత్రం వటఏవసాక్షాత్సతీర్థరాజో జయతి ప్రయాగః॥

౫ శ్రుతిః ప్రమాణం స్మృతయః ప్రమాణం పురాణమప్యత్రపరం ప్రమాణమ్।
యత్రాస్తి గంగా యమునా ప్రమాణం సతీర్థరాజో జయతి ప్రయాగః॥

ఇత్యాదిమహామాహాత్మ్యదంబగు ప్రయాగ అలహాబాదుకు రైల్వేదూ
రమందు పూర్వగా శ్రీగంగాపశ్చిమమున ధారాగంఢ నెడు .పేరుగలిగియు
న్నది. యిందలికోటకోసే భోజమహారాజుండెననియు నాటిధారానగ్నమే
యిదియనియు చెప్పిరి భూమికిసమముగాంనుడునొకచోటనుండి గంగాప్ర
వాహిలిముగా కొన్ని మెట్లుదిగిదీపప్రకాంతిని ౧౦ బారలుదూరముపూ
ర్వగాపోయిచూడగా నచ్చట రెండునిల్వలుపాదువుగల యొకపురాతనవ
టవృక్షము శిఖరముకొట్టివేయబడి మొరడువలెనున్నది ఇదే యక్షయవ
టమనిచెప్పెదరు దీనిచుట్టును శిలావిగ్రహములుగలవు అవి దేవతలనియు
ఋషులనియుం జెప్పి గంగాపుత్రులు యాచించెదరు యథాశక్తిగా సమ
ర్పించి ప్రదక్షిణపూర్వకముగాపోవుట యాచారమైయున్నది.

## త్రివేణివృత్తాంతము.

బదరీనారాయణ మహాక్షేత్రమునకువాయవ్యమందున్న హిమవత్ప
ర్వతశాఖలలోజనించి వసుధారయనుపేరుగా ప్రాగ్వాహినియై కొంతవర
కు ప్రవహింపుచువచ్చి చీనాదేశపురస్తుకు పడమరగా దేవప్రయాగయను
చోట బ్రహ్మసరోజనిత హిమవత్పర్వతాగత సరస్వతీనదితో సంగమించి
బ్రహ్మకపాలమునకుతూర్పుగావచ్చినది మొదలు అలకనందయనెడుపేరుగ
లిగిహరిద్వారములో కనఖలమన్నప్రసిద్ధిపన్నత్రిలోకపావనియైనశ్రీగంగాన
దిభగీరథ ప్రార్థనవలన సుప్రసన్నుడయి శ్రీజగదీశ్వరుడుతనజటాజూట
మునుండియిచ్చిన బింధుమాత్రమైన గంగబదరీకేదారములో గంగోత్తరి
యనుచోట. నుత్పన్నమయి ప్రవహింపుచువచ్చి కలసినది మొదలు భాగీర
థీయను పేరుగలిగి హస్తినాపురంబయిన పాతడిల్లీనొరసి క్రమక్రమము
గా నదరు ప్రయాగకోటకు ప్రాగ్భాగమందు ప్రవహింపుచుంబోయి మీా
ర్జాపూరుమీాదుగా శ్రీకాశీక్షేత్రమునో నుత్తరవాహినియై కలితాపైని
సముద్రములోకలిసినది.

శ్రీయమునానదియు గంగోత్తరికి పశ్చిమవాయవ్యముగా కళిందగి
రినుండి యమునోత్తరియనుచోట నుదయించి యింద్రప్రస్థ పురంబయిన
క్రొత్తడిల్లిగోవర్ధనము బృందావనము మధురగోకులము ఆగరా మొదల
యినవాని నొరసి యీాప్రయాగకోటయొక్క దక్షిణప్రాకారమునొరసిప్ర
వహింపుచుభాగీరథితో సంగమించినది.

ఇట్లు గంగా యమునా సరస్వతులు మూడును కలిసినందున దీనికి త్రివే
ణి యనియు పేరు. త్రివేణిమహిమ ప్రయాగమాహాత్మ్యాది గ్రంథములయం
దు విశేషించి చెప్పబడియున్నది. ఇదిగాక కోటకట్టకమునుపు పైనుదహరిం
చబడిన అక్షయవటశాఖలు త్రివేణిలోకి వ్యాపించుచుండగా భక్తులైన
వారెద్దరైన నొకటి కోరుకొని అక్షయవటశాఖల మీదనుండి త్రివేణిలో
కి దుమికి ప్రాణత్యాగము గావించి యవ్యవహితోత్తరజన్మమందే వాంఛిత
సిద్ధిని బొందుదురన్న క్షేత్రమహత్త్వము లోకప్రసిద్ధిగలదని విని యెవ్వరో ము
వ్వురు పడవుచు జవ్వనులవ్వటశాఖనెక్కి మహారాజు తనకు భర్తగావల
యునని యొకతెయు విద్యారసికుడు భర్తగావలయునని యొకతెయు మహా
కవి భర్తగావలయునని యొకతెయు సంకల్పించి త్రివేణిలోనికి దుమికి మృతి
బొందుట జూచి తదుత్తరక్షణమందే ఉదకకర్మ సేయుచున్న యొక మంగలిత
నపాదిని మత్తిబారలో భద్రపరచి యీ భద్రగజయానలు మువ్వురికిని
నేను భర్తను గావలయునని సంకల్పించి తానును అక్షయవటశాఖనెక్కి
త్రివేణిలో బడి మృతుండయి భోజమహారాజయి పుట్టెననియు వారు మువ్వు
రు తనకు భార్యలైరనియు భోజకాళిదాస సంవాదంబులో నీ మంగలిగుణము
మానవని కాళిదాసు యొకసక్కము శాయగా భోజుడు నవ్వి కాళిదాసుయొ
క్క సర్వజ్ఞత్వమును శ్లాఘించి తాను పూర్వజన్మమందు మత్తిబారిలో
దాచిపెట్టిన పాదిని చూపించి వేశ్యలయొక్కయు తనయొక్కయు పూర్వజ
న్మసంకల్పమును త్రివేణీమహిమయు నగ్గడించి సంతసించిరన్న ప్రసిద్ధినిబట్టి
యో మరి యే హేతువునబట్టియో యిటీవల అక్షయవటమును విస్వాల
కముగా కొట్టి మొరడుచేసినారని కొందరు చెప్పిరి.

ఇట్టి త్రివేణీతీరమందు పెక్కండ్రు గంగాపుత్రులు చిత్రవిచిత్ర
ములయిన జండాలతో పైని చప్పరములు గట్టియున్న బల్లలు పైని వసించి యా
త్రికులచేత త్రివేణీపూజయు సువాసినీ స్త్రీలచేత వేణీసమర్పణంబును మొ
దలయిన తీర్థవిహితకృత్యంబులు చేయింపుచుందురు ( ప్రయాగే ముండ
నం కార్యం ) అన్న వచనమునుబట్టి సదాచారముగా నిచ్చట జరుగుచున్న
ది సువాసినీ స్త్రీలలో కొంచపురోజులలో విధవలు కాబోవువారు సమర్పిం
చిన వేణి త్రివేణిలో మునగక తేలిపోవునట మాఘమకరమునకు పుష్కరమున
నకు పెక్కుజనమిచ్చటికి వచ్చుచుందురు.

శ్లో॥ దశతీర్థసహస్రాణి తిస్రఃకోట్యస్తథాపరాః।
సమాగచ్ఛంతిమాఘ్యాంతు ప్రయాగేభరతర్షభ॥ 31
శ్లో॥ మాఘమాసే ప్రయాగస్తు నియతస్సంశితవ్రతః।
స్నాత్వాతుభరతశ్రేష్ఠ నిర్మలస్స్వర్గమాప్నుయాత్॥ 32

అని శ్రీభారతఆనుశాసనికపర్వములో 25వ అధ్యాయములో చెప్పబడియున్నచొప్పున ప్రతిమాఘమాసమందును వేలవేలప్రజప్రయాగకు వచ్చుచుండును.

ప్రయాగ సంకల్పము.

ఆర్యావర్తాంతర్గత బ్రహ్మావర్తైకదేశే విష్ణుప్రజాపతిక్షేత్రే షట్కూలమధ్యే అంతర్వేద్యామ్ భాగీరథ్యాః పశ్చిమతీరే కాళింద్యాఉత్తరతీరే వటస్య పూర్వదిగ్భాగే విక్రమశకే బౌద్ధావతారే త్రయస్త్రింశత్కోటిదేవతాగ్రహాహ్వాన హరిహరగురుచరణ సన్నిధౌ శ్రీవేణీస్నానమహంకరిష్యే అనిచెప్పుచుందురు.

ప్రయాగకుపశ్చిమ వాయవ్యముగా రెండుమైళ్లదూరములో భరద్వాజాశ్రమమున్నది రావణవధానంతరమందు సపరివారముగా వేంచేసిన శ్రీరాములవారికి భరద్వాజమహాముని విందుజేసినస్థలమిదియేనటయిచ్చట శ్రీరామభరద్వాజాదిమహాముని ప్రతిమాలింగములుగల చిన్నచిన్నదేవళములు పెక్కున్నవి భరద్వాజాశ్రమమునకీశాన్యోత్తరముగా 3 మైళ్లదూరములో మఝ్గామయనునూరుయొక్క ప్రాగ్భాగముగా మైదానమందుగంగాదక్షిణతీరమున కనతిదూరముగా శివకోటీశ్వరస్వామివారనుపేరుగలలింగమున్నది ప్రతిశ్రావణ శు 2 నాటిరాత్రి చతుర్దయము మొదలుకొని అష్టమిరాత్రివరకు లోకోత్తరమైనమహోత్సవముజరుగుచుండును ఇచ్చటిగంగలోమునింగియీస్వామివారిని సేవించినవారికిసకలతీర్థస్నానఫలముకోటిగుణితముగాగల్గునన్నమహాత్మ్యమునుబట్టి సర్వజనులున్ను వచ్చి సేవింతురు.

భారాగంజునకువాయవ్యకోణమందొక చిత్రమైనదేవాలయమున్నది దానిలో లింగమునుచుట్టుకొని పైకిపడగయెత్తి యొకపాము నిజముగా కాపేయుచుటున్నది ఇదే వాసుకిలింగమనికొందరనిరి.

శ్లో॥ త్రివేణీంమాధవందేవీమ్ భారద్వాజంచవాసుకిమ్।
వందేక్షయవటంచైవ ప్రయాగేతీర్థనాయకమ్॥

ఇటుల ప్రయాగలో నిత్యయాత్ర సేయుచుందురు. ప్రయాగనుండి శుద్ధగంగయు మట్టియు యిసుకయు తెచ్చి పుణ్యయోగపరచుచుందురు ప్రయాగమహిమ విశేషించి వ్రాయుట అనౌసరమైయున్నది ప్రయాగమహాత్వ మయిపరిణారాణాధులంజూచి యానందించునది.

## వింధ్యవాసిని.

ప్రయాగనుండి కాశీకివచ్చునప్పుడు త్రోవలోనడమనున్న రస్తాకు కించిద్దక్షిణముగా ప్రవహింపుచున్న భాగీరధికి దక్షిణతీరమందున్న మిర్జాపూరుదాటినపైని వింధ్యశిఖరమందు శ్రీకృష్ణావతారమునాటి యోగమాయవింధ్యవాసినియనుపేరువెలసిభక్తులకుభుక్తిముక్తులనిచ్చుచుండెను. ఈక్షేత్రమునకుబోయి యీమెనుసేవించినవారికి గ్రహబాధ దొలగంజేయును అనగా మాయాతీతులగుదురని.

## ప్రయాగక్షేత్రమహిమ

## సంపూర్ణము.



## శ్రీమదయోధ్యామహాక్షేత్రము.

శ్రీమద్రామావతారస్థలమై విరాట్పురుషునకు మస్తకస్థానియమైమ త్రిస్థానములైన సప్తపురములలో మొదటిదైనరయోధ్య దక్షిణతీరమందు మీనాకృతిగాప్రకాశింపుచున్న అయోధ్యామహాక్షేత్రములలో తీర్థవిహితకృత్యములుజరిగించవలయును శ్రీరాములవారినాటి యయోధ్య నరయూనదిలోనిమగ్నమైనదటదానితాలూకుకొన్నిఘట్టములు కొన్నిమందిరములు ప్రకృతాయోధ్యకుపడమరగా 3 మైళ్ళలోనున్నవి ఇచ్చటవరెనేలచ్చుటసైతముయాత్రికులు తీర్థప్రయుక్తకృత్యములుజరిగింపుచుందురు.

శ్రీకృతాయోధ్య సరయూనది ఘట్టములు.

౧ రామఘాటీ
౨ భరతఘాటీ
౩ లక్ష్మణఘాటీ
౪ శత్రుఘ్నఘాటీ
౫ హనుమాన్ ఘాటీ
౬ స్వర్గద్వారఘాటీ
౭ విభీషణఘాటీ
౮ వసిష్ఠఘాటీ
౯ వల్మీకిఘాటీ
౧౦ సుగ్రీవఘాటీ

యిట్టినామధేయములతో పెక్కుఘట్టములున్నవి ఇచ్చటిసంకల్పము.

వింధ్యస్యోత్తరాత్యార్యావర్తాంతర్గతకోసలదేశే ప్రమోదవనే నందిగ్రామే సారస్వతక్షేత్రే బ్రహ్మస్నానతీర్థే అయోధ్యాయాంసరయూదక్షిణాభిముఖేపూర్వవాహిన్యాం స్వర్గద్వారే విశ్రమశకే బుద్ధావతారే త్రయస్త్రింశత్కోటిదేవతా బ్రాహ్మణగురుచరణసన్నిధౌ సరయూమహానదీస్నానమహంకరిష్యే" అనిచెప్పుదురు.

శ్రీరాములవారు వనవాసమునకు వెడలినలీలలుమాత్రముతప్ప తక్కినలీలలు అనగా పుత్రకామేష్టి మొదలు అవతారసమాప్తివరకు యావల్లీలనుసూనిలకంర చంద్రశేఖరాది శివమందిరములు పెక్కుగానున్నవి శ్రీహనుమన్మందిరము అయోధ్యకోటయొక్క ఆగ్నేయపుబురుజున్న ప్రసిద్ధిగల యొకయున్నస్థలమందున్నది అందులో సువర్ణమయమయిన యొకహనుమద్విగ్రహమున్నది యాక్షేత్రములో శ్రీరామభక్తికన్న హనుమద్భక్తి యెక్కువగాకలిగియున్నందున నిరంతరము బహుసంమర్ధముగానుండును.

శ్లో॥ విష్ణోశ్శిపాదమవంతికాంగుణవతీం కాంచీంచకాంచీపురీం।
నాభౌద్వారవతీంవదంతిహృదయేమాయాపురీంయోగినః॥
గ్రీవామూలముదాహరంతిమథురాం నాసాగ్రవారాణసీ।
మేతద్బ్రహ్మపదంవదంతిమునయోయోధ్యాపురీమస్తకమ్॥

అని యిత్యాదిమహిమ రుద్రయామళమునందలియయోధ్యామాహాత్మ్యములో ౨ అధ్యాయమందు ౫౭ వ శ్లోకముమొదలుగా చెప్పబడియున్నది.

ధ్యానశ్లోకములు.

౧ శ్యామలక్ష్మణపూర్వజం రఘువరంసీతాపతింసుందరం।
కాకుత్స్థంకరుణార్ణవంగుణనిధింవిప్రప్రియంధార్మికమ్॥

రాజేంద్రసత్యసంధందశరథతనయంశ్యామలంశాంతమూర్తిం।
వందేలోకాభిరామం రఘుకులతిలకంరాఘవంరావణారిమ్॥
౨ వేదాంతవేద్యోయజ్ఞేశఃపురాణపురుషోత్తమః।
జానకీవల్లభః శ్రీమానప్రమేయపరాక్రమః॥
౩ శ్రీరామచంద్రచరణౌమనసాస్మరామి
శ్రీరామచంద్రచరణావచసాగృణామి।
శ్రీరామచంద్రచరణౌశిరసానమామి
శ్రీరామచంద్రంశరణంచరణౌప్రపద్యే॥
౪ దక్షిణేలక్ష్మణోయస్య వామేతుజనకాత్మజా।
పురతోమారుతిర్యస్యతంవందేరఘునందనమ్॥

శ్రీమదయోధ్యాక్షేత్రము

సంపూర్ణము.





## శ్రీ మధురా మహా క్షేత్రము,

మధురచంతనే ప్రాగాగ్నేయవాహినిగా శ్రీయమునానది ప్రవహించుచున్నది అయోధ్యలో సరయూనదికివలెనే దీనికి పెక్కుఘట్టములున్న విఖదియును పంచక్రోశమేయని కొందరందురు ఆదివరాహపురాణము లో ౩౨ అధ్యాయము లపరిమితములుగల మధురామాహాత్మ్యములో ౨౧ ఆమడవలయాకారముగా మధురామహాక్షేత్రము వ్యాపించియున్నద నియుందురు కంసవాధాది శ్రీకృష్ణలీలలు సమగ్రముగానున్నవి కాశిలోవలె నే వీథులుమెలికలుగానుండును పట్నమంతటను జాతికట్నమాటవలన పరిశుద్ధముగానేయున్నది చతురశీతిక్రోశ పరిమితచేత ప్రదక్షిణములోనే గోకులము వ్రేపల్లెబృందావనము తాళవనము మధువనము వేణువనము కుమారవనము భూషణవనము ఉపవనము గోవర్ధనము మానససరస్సు మొదలయిన మహాస్థలంబులు యున్నవి.

దురు స్వామిసన్నిధిలో మండపము బహుసుందరముగాయున్నది.

భాగవతాది గ్రంథములలో శ్రీబలరామకృష్ణు లీమధురలో గనపరచి నలీలలన్నియును యథార్థములేయని నమ్మదగిన మూతుకలలో పెక్కు మందిరములున్నవి తత్తత్కాలములయందు మహోత్సవములు చేయుబడుచుండును.

మధురానుకల్పము.

ఆర్యావర్తాంతర్గత మధ్యదేశే ఆదివరాహ భూతేశ్వరక్షేత్రే మధురామండలే కేశవదేవసన్నిధౌ (అని) పూర్వోత్తరఖండములు మామూలుగానే చెప్పవలెను.

శ్లో. కేశవేవసమోదేవో మాధురేణసమోద్విజః।
భూతేశ్వరసమంక్షేత్రం నభూతోనభవిష్యతి।
నవిశ్రాంతిసమంతీర్థం సత్యంసత్యంవసుంధరే॥

అని దీనిమహిమ పురాణమందున్నది ఇదిగాక.

శ్లో వింశతిర్యోజనానాంచ మధురామండలంమమ।
యత్రతత్రనరస్స్నాత్వా ముచ్యతేసర్వపాతకైః॥

అని మధురామాహాత్మ్యములోనున్నదిగావున నీమధురామండలములో పుణ్యతీర్థములు పుణ్యస్థలములు పెక్కుగానున్నవి యిందిగాక మహర్షులు దేవతలు తపస్సులుచేసి ఫలసిద్ధిపొందిన పుణ్యక్షేత్రములు వేనవేలుగలవు.

దర్శనస్పర్శన దానధర్మ క్రియాకలాపముల మనోభీష్టసిద్ధిప్రదములగుటయేగాక తన్మృతులైనవారికి ముక్తిప్రదమగునని స్థలపురాణములో వర్ణింపబడియున్నది మరియు,

శ్లో॥ దర్శనాదభ్రసదసి జననాత్కమలాలయే।
కాశ్యాంతుమరణాన్ముక్తి స్స్మరణాదరుణాచలే।
అయోధ్యామథురామాయా కాశీకాంచీఅవంతికా।
పురీద్వారవతీచైవ సప్తైతేమోక్షదాయికాః॥

అని ముక్తిస్థలములుగా నేర్పడిన కాశీకాంచ్యాదిమహాక్షేత్రములకన్నను మధురామహాక్షేత్రము మహోత్తమమని సంక్షేపముగాదాని మాహాత్మ్యమును ప్రశంసించుటలో.

శ్లో॥ కాశ్యాదిపుర్యోయదిసంతిలోకే తాసాంతుమధ్యే మధురైవధన్యా।
యజ్జన్మమౌంజీవ్రతమృత్యుదాహైర్నృణాంచతుర్ధావిదధాతిమోక్షం॥

మధురలో జనించినను బ్రహ్మోపదేశమనగా ఉపనైనమైనను మృతిబొందినను దహింపబడినను ముక్తినొసంగునని తాత్పర్యము.

శ్లో॥ భూతేశ్వరంచ వారాహం కేశవం భాస్కరం ధ్రువం।
దీర్ఘవిష్ణుంచ విశ్రాంతం దృష్ట్వా పాపవినాశనం॥

అని యీప్రకారముగా నిత్యయాత్ర సేయుచుందురు భూతేశ్వరమందిరము మధురకు నైఋతిభాగమందు గోవర్ధనమునకుబోవు రోడ్డుప్రక్కను యమునకు మైలుదూరముగానున్నది ఆయాదిభూతేశ్వరస్వామివారిలింగము తెల్లగానున్నది లింగమునకొకవైపు ముఖమున్నది ఆలింగము చిరకాలమునుండి మహర్షులచేతను ఇటీవల కంసాదుల చేతను యదుప్రభువుల చేతను భక్తిశ్రద్ధాపురస్సరముగా సేవింపబడుచున్నదిగా పురాణవేత్తలైన స్థజ్ఞులనిరి.

ఈభూతేశ్వరస్వామివారి భార్య పాతాళసిద్ధేశ్వరియనుపేర తదావరణములోనే ప్రత్యేకాలయములలో ప్రకాశింపుచుండెను ౧౨ నిల్వులలోతుగాదిగి దీపకాంతిచేత దర్శింపవలసియుండును ఈస్థలమునకీశాన్యభాగమందు నాతిదూరముగా శ్రీకృష్ణజన్మస్థలమున్నది అందేవసుదేవకారాగృహముగలదు ఈమధురామండలమునకెల్ల ముఖ్యస్థలమిదే వరాహాదిదేవతామహిమలు మధురామహాత్మ్యమునందే మాదిసంతసించునది.

మధురాక్షేత్రమహిమ

సంపూర్ణము.



గోకులము అనగా వ్రేపల్లెవిశేషములు.

మధురామహాక్షేత్రమునకు దక్షిణముగా ౬ మైళ్ళలో యమునా దక్షిణతీరమందున్నది,

౧ గ్రామపూర్వభాగమందే గోవిందకుండమనేడు పూలతోటకుంత

మున్నది శ్రీకృష్ణుడిచ్చటనే పూతననుజంపెనట దీనిలోస్నానమార్జనాదు
లొనరించుట యాచారమైయున్నది.

౨ మదనమోహనమూర్తిస్థలములలో లోహమాయములైనగో
వులుపరివేష్టింపగా శ్రీకృష్ణమూర్తి వేంచేసియున్నలీలగనంబడును

౩ నందకవాటమని యమునరేవొకటికలదు ఇదియేపురద్వారమ
నియుచెప్పుదురు దీనిగుండానే వసుదేవుడు శ్రీకృష్ణునిదోడ్తెచ్చి యశోద
ప్రక్కలోనిడెనట ఇది యమునాతీరమందేయున్నది.

౪ మరియొకచోట యశోదానందులనెడుమనబాలకృష్ణమూర్తియు
నుండిరివీరినియుయ్యాలతొట్లలోనుంచియున్నలీలమనోహరముగానేవున్నది.

౫ ఇంకొకతావున దేవకీవసుదేవుల సన్నిధిలోబలరామకృష్ణులను
యోగమాయయునున్న లీల గనపరచుచున్న విగ్రహములు సుందరము
గానున్నయది.

౬ మృత్తికాభక్షణమొనర్చినబాలగోపాలమూర్తియున్నస్థలము

౭ శ్రీకృష్ణుడు యమళార్జునభంజనమొనరించిన లీలయు.

౮ గోవర్ధనగిరి యెత్తినలీలయు.

౯ ప్రత్యేకముగా బలరాములు వేంచేసియున్నలీలయు.

౧౦ యమునాసైకతమందు బాలక్రీడగా పాలిగిల్లుటకదిగండా
లుయాత్రికులచేతచేయించి గృహాకారరేఖనవ్రాసి దానిలో దేవతావా
హనముజేసి యభిమంత్రించి యాశీర్వదించి దానిలోనిది కొంతమునక
యును శ్రీకృష్ణభక్షితమృత్తికయను నిచ్చెదరు అది సంగ్రహించితెచ్చిపూ
జించుచుందురు.

ఇట్టిలీలలుగల యీయూరు నవీనమైనదనియు దీనికి ప్రాగాగ్నేయ
ముగా ౨ మైళ్ళలో నిజమైనగోకులమున్నదనియు చూడగా నవనీతభక్ష
ణదధిమథన విశ్వాగ్రహణాది లీలలు పెక్కుగలవు.

గోకులమునారసి యాగ్నేయభాగమందుకించిదున్నతస్థలమందుదక్షి
ణాభిముఖముగా బహుపురాతనమయినట్టు కనంబడుచున్నందున శ్రీకృష్ణావ
తారకాలమునందు నందునిచేత కట్టింపబడినదేయని నమ్మదగినపసిగలది
గామనలుపలకలుగా చెక్కబడిన సత్యకాలపుపసిగల ఱాతికంబములునజను
జాలుకో ౧౬ గలదిగాను చూపట్టుచున్న యొకనాడనసోపాగలదు దాని

లో బలరామకృష్ణుల యుయ్యాలలో నిలిచిన లాంఛనములుగల రెండుచోట్లు రమ్యముగానున్నవి

ఈ తోట్టెలో వారినిర్వారనుపన్నుండబెట్టి యశోదతత్సమీపమం దుదధిమథనము సేయుచున్న స్త్రీ గనబడినది అనగా పెరుగుకుండ నిట్టి తరాడు కవ్వమునిల్పియుంచిరి పూర్వమందు యశోద పెరుగుదెచ్చి వెన్న దిగియుచున్న సమయములో చిన్నికృష్ణుడు మన్నుదిన్న వంగతిబలరామునివలన నెరింగి వెన్నదిగియుటదిగనాడి వెన్న చేతులోకి శిలా స్తంభము నరాచితుడి చికోని శ్రీకృష్ణునిబటుకొనుటకు పోవునంతలోనతండెదురయి యశోదకుపట్టువడకుండ నందలిశిలా స్తంభములలో బహురీతిగా మెలికలుగా తిరిగితిరిగి కొనకు విక్షించిదాటికిన చోటిదేయని పండాలు చెప్పుటయే కాక యాత్రికులచేత శ్రీకృష్ణునియుయ్యాలలూపించి శిలా స్తంభములనుచూపుచుందురు అదియునుగాక.

౧ బ్రహ్మాండపట్టము ఇది చింతాహరణ దేవస్థానములోనున్నది.

౨ రమణరేతి అనగా శ్రీకృష్ణుడు గోపకులతో యమునా సైకతమందు పొర్లాగిల్లిన చోటు,

3 ఊఖరీ అనగా ఉలూఖలబంధనస్థలము ఇది గ్రామములోనే యున్నది.

౪ దేవకీపసుదేవస్థలము ఇది హనుమంతుడు ప్రార్థించిన చోటు.

౫ నందయశోదాస్థానము

౬ యోగమాయాస్థానము

౭ చౌరాశిఖమ్భ

ఇవి గ్రామములోనే యున్నవి

౮ వృద్ధ్భతృణస్థలము ఇది గ్రామమునకు పడమరగా మయిలుదూరమునందున్న వనంబులోనున్నది.

ఇత్యాదిస్థలంబులు పెక్కుగానున్నవి ౧ సంగ్రామము ౨ గోకులము 3 బృహద్వనము ౪ మహావనము ౫ బలదేవవనము అని దీనికయిదు నామములుగలవు ఇచ్చటికి మరి రెండుమయిళ్ళలో ప్రాగాజ్ఞేయముగా బలరాముడున్న స్థలంబున్నది,

## చతురశీతిక్రోశపరిమితమయిన శ్రీమథురామండలములలోని కతిపయ విశేషములు.

| వనములు. | సేవించువారికిలభించేఫలములు. |
|---|---|
| ౧ మధువనము | సర్వకామప్రదము |
| ౨ తాళవనము | స్నానమాత్రకృతకృత్యతాహేతువు. |
| ౩ కుముదవనము | ప్రతిభాద్రపద బ ౧౧ కి స్నానమొనర్చినవారికి రుద్రలోకంబుసిచ్చును. |
| ౪ కామ్యవనము | విష్ణులోకప్రాపకము |
| ౫ బహులావనము | అగ్నిలోకప్రదము (లోకప్రదము. |
| ౬ భద్రవనము | ఇది యమునాపరపారమందున్నది నాగ |
| ౭ ఖాదిరవనము | నాగలోకప్రదము |
| ౮ మహావనము | శ్రీవిష్ణుప్రియము నాగలోకప్రదము |
| ౯ బిల్వవనము | ఇంద్రలోకప్రదము |
| ౧౦ లోహజంఘవనము | బ్రహ్మలోకప్రదము (ప్రదమగును. |
| ౧౧ ఖాండీరవనము | ఇందున్నవాసుదేవునిదర్శించిన మోక్ష |
| ౧౨ బృందావనము | ఇదిబృందాదేవిచేత రక్షింపంబడినది విష్ణుమూర్తికతిప్రీతికరము గావున సదరుబృందావనమును దానియందున్న గోవిందునినరసి సేవించినవారు ముక్తినొందుదురని, |

ఇట్టివిశేషములచేతములుగలవు (ముఖ్యమయినతీర్థంబులు.

| | |
|---|---|
| ౧ ధారాపతనతీర్థంబు | స్వర్గప్రదంబు |
| ౨ నాగతీర్థంబు | డిటో |
| ౩ ఘంటాభరణతీర్థము | సూర్యలోకప్రదము |
| ౪ యమునాతీర్థము | బ్రహ్మవిష్ణ్వాదిలోకప్రదంబు |
| ౫ సోమతీర్థంబు | ఇదియమునలోనేవున్నదిసోమలోక |
| ౬ సరస్వతీతీర్థంబు | ఎట్టినీచునైనఘనంజేయును(ప్రదంబు |
| ౭ దశాశ్వమేధతీర్థంబు | స్వర్గదంబు |
| ౮ మానసతీర్థంబు | ఇదియమునాపశ్చిమపార్శ్వమందు |

# శ్రీ బృందావనము.

౧ మధురకుదక్షిణంబుగా ౬ మైళ్ళదూరమందున్న ప్రాగ్వాహిని యైన యమునకు దక్షిణతీరమందే బృందావనమహాక్షేత్రంబున్నది మధ్యర తీరావతీరనే పెక్కుఘట్టంబులున్నవి వానిలో కేసిఘట్టంబు ముఖ్యమైనది ఇచ్చటనే కేశియనురాక్షసుని శ్రీకృష్ణుడుసంహరించెను తదీయమూర్తులిందున్నవి

౨ మహామద్గట్టంబు హనుమంతుడు శ్రీకృష్ణునిదర్శించి సేవించిన లీలలిందున్నవి,

౩ భ్రమరఘట్టంబు తుమ్మెదలతో శ్రీకృష్ణుడు క్రీడించినచోటు దీనినే బోరాఘాటందురు.

౪ గోపీవస్త్రాపహరణఘట్టంబు దీనినే చేలాఘాటందురు.

౫ రాసక్రీడాఘట్టంబు శ్రీకృష్ణుడు రాసక్రీడానంతరంబు గోపికలతో స్నానంబుచేసినతావు దీనికి దక్షిణపార్శ్వమందే దక్షిణాభిముఖంబుగా శ్రీరాధామందిరంబున్నది దీనియందే రాధాతో శ్రీకృష్ణుడు క్రీడించెనట,

౬ దీనికి పశ్చిమంబుగా కొంతదూరంబులో ముఖదర్శనమనునది యున్నది శ్రీకృష్ణుడొకప్పుడు గోపికలకు మూర్తిదర్శనమొసంగక ముఖనేత్రంబులుమాత్రము చూపించినచోటిదియందురు అట్టిలీలలున్నవి.

౭ కాళియమర్దనఘట్టంబు దీనికి పార్శ్వమందు తంపరవలెనున్న ప్రవాహంబులో శ్రీకృష్ణుడు కాళియునిమర్దించెను దీనితీరమందున్న గుంబీలలో యశోదానందవిగ్రహంబులు ఇంకొకతావున శ్రీకృష్ణవిగ్రహంబునున్నవి కాళియాకారంబుగా నొకనిలువుబట్టవంటి సర్పాకారంబును దానికిచుట్టుపడగలునున్నవి సమీపమందు మందిరంబున్నది.

౮ దానికిబడమరగా వంశీనాదంబుచేసిన బలరామకృష్ణుల పాదంబులు కదంబవృక్షంబుక్రిందనున్న ఘట్టంబున్నది దీనినే బంశీబటఘాటనిచెప్పుచుందురు.

౯ మరియొకఘట్టంబునకు దక్షిణముగా బాలకృష్ణమందిరంబున్నది దానిలో వేణుగోపాలమూర్తి ప్రసన్నమూర్తిగలిగియుండెను,

౧౦ సేవాకుంజరమనెడు పుణ్యస్థలమొకతావునన్నది.

౧౧ యమునకుత్తరతీరమందు బృందావనమున కీశాన్యభాగమందురాస క్రీడాస్థలమున్నది.

౧౨ మధురా బృందావన మధ్యమార్గమందు యమునకుత్తరతీరమందక్రూరమందిరమున్నది.

౧౩ మధురకుత్తరతీరమందు దసతీదూరముగా నొకవనమందు భైరవాలయమున్నది.

౧౪ రాగి రజిత స్వర్ణములతో శ్రీరాధాకృష్ణపాదములు శాస్త్రోక్తముగాచేసి విక్రయముచేయుచుందురు యాత్రికులు తెచ్చి దీనిని పూజింపుచుందురు.

## గోవర్ధనగిరి విశేషములు.

మధురకుపడమరగా ౧౪ మైళ్ళదూరమందు గోవర్ధనగిరియున్నది బ్రహ్మతీర్థము మానసగంగయనెడు జాలాశయముగలదు ఇదిరెండుభాగములుగానున్నది ఈరెండుభాగములనడుమ నిలువుపొడువుగా సొగసైనొకశిలాపరంపరాక్రాంతమై సేతురూపమైనగిరిగలదు ఇదే గోవర్ధనగిరియని స్థలవాసులనిరి ఆసేతువుకుతూర్పుమొగను మందిరములున్నదివానిలోనలు పలకలుగా రెండుశిలను లింగాకారముగానున్నవి వానిలోపడమరవైపుగానున్నశిలను శ్రీకృష్ణునిగానుతూర్పువైపుననున్నశిలను నందునిగానుచెప్పిరి అచ్చటిపండాలాచిన్నశిలకేక్షీరాభిషేకపూర్వకముగా పూజగావించెదరు ఈమందిరమునకు పశ్చిమముగా నూరిలో మరికొన్ని మందిరంబులునువానిలో శ్రీకృష్ణలీలావిగ్రహంబునుగలవు సకలేశ్వరమహాదేవుడు మానసదేవి మొదలైనదేవతలు మందిరములు పెక్కున్నవి వీనిలో గోవర్ధనగిరిధారమైన శ్రీబాలకృష్ణమూర్తి ముఖ్యమైనది రైలుమీదుగా మిరాపూరుస్టేషనుండివచ్చుమార్గములో పాటలీపుత్రపురమనియు అందురు ఇదిగంగాదక్షిణతీరమందు ౨౪ క్రోసులనిడువుగల్గియున్నది అన్నిపదార్థములుగలమంచిబజారులున్నవి అనేకదేవాలయములున్నవి ౧ మొదలు ౫ వరకు ముఖములుగల శివలింగములు పెక్కుగాస్థాపింపబడియున్నవి అనుకూలముగా భోగరాగములుజరుగుచున్నవి వుదయముస్నానంబోటుగుండా బయలుదేరి పడమరగా ౭౪ మైళ్ళుగంగకెదురుగాబోయి అక్కడనుండి వాయవ్యము

గా కొంతవరకును ఉత్తరముందుగా కొంతవరకును ఈశాన్యముగాకొం తవరకునుపోయి గంగగండకి సంగమస్థలమందు స్టీంబోటుదిగి స్నానాద్యా హ్నికములుదీర్చుకొని అచ్చటికి ౧ మైళ్ళదూరమునున్న శ్రీహరిహర క్షే త్రమునకుబోయి సేవించవలయును అందనేకదేవాలయములు మఠములు నున్నవి అందొకమందిరములో ప్రాఙ్ముఖముగామందిరపశ్చిమ భిత్తికను హస్తిచతుర్భుజములతో నొకమూర్తియున్నది ఈమూర్తికెదురుగా ౧ ౩ మూరలమేర నొకశివలింగమున్నది అయనహరి ఈయనహరుడుగనుక యిది హరిహరక్షేత్రమయ్యెనని కొందరిని ఈరెండును బహుపురాతనము లైనందునపూర్వాపర నిరూపణముసేయజాలముగాని విగ్రహమే హరిహ రేశ్వరుడని కొందరనిరి శ్రీహరిధ్యానశ్లోకోక్తలక్షణమువిగ్రహమునందు గానవచ్చుటంబట్టి ఈవిగ్రహమే హరిహరేశ్వరస్వరూపమనవచ్చును.

శ్లో॥ శూలంచక్రంపాంచజన్య మభీతిందధతంకరైః।
స్వస్వభూషాచ్ఛలీలాఢ్యం దేహంహరిహరంభజే॥

సీసపద్యము.

శ్రీకమనీయనృపాకపాయీమనోహరవిగ్రయతుభ్యంనమోస్తు।
పున్కరనేత్రాయభూతేశ్వరాయదివ్యాబ్ధరాయతుభ్యంనమోస్తు।
హరిదంతహరిసమాఖ్యాయఘనభాసితాఖిలాంగాయతుభ్యంనమోస్తు।
సాక్షాద్రసగజాసురతృణసవ్యాప్తధవ్యపధాయతుభ్యంనమోస్తు।
భవహరిశివాభిధాయతుభ్యంనమోసుహహిమాం దేహిమాంగళ్య। (వ॥
పదమటంచుశాస్త్రోక్తానంద ... నన్నుతింతుహరిహరేశ్వర దేవమహానుభా

యిటులధ్యానించుచూ సభక్తికముగాను యథాశక్తితోనుపూజా దికములు జరిగించుకొని ప్రసాదాదులు స్వీకరించి మరల పాటనా చేయునది॥

శ్లో॥ ఏకైవశక్తిఃపరమేశ్వరస్య భిన్నా చతుర్ధావినియోగకాలే।
భోగేభవానీపురుషేషువిష్ణుకోపేచకాళీసమరేచదుర్గా॥

అని చెప్పినచొప్పున శ్రీజగదీశ్వరునియొక్క క్రోధశక్తియైనకాళికి ఆలా అనగా నివాసస్థలమైనందున యీమహారాజధానికి కాలీకాతాయని మొదటపేరువచ్చినది క్రమముగా నిప్పటివ్యవహారములో కలికాతాయని యందుబడుదక్షిణవాహినియైనగంగానదికిప్రాక్తరమందు గెం క్రోసులవిస్తీర్ణ

తగలిగి సంపన్నిధియై దక్షిణోత్తర దీర్ఘమయియున్న దిదక్షిణభాగమం
దు గుల్ఫపీఠాధిదేవతస్థైన.

శ్రీకాళీదేవియొక్క భయంకరమయినవిగ్రహము పక్షిణాభిముఖము
గా లంబమానదీర్ఘతర రక్తజిహ్వాగల దెతామనపూజలనొందుచు ప్రకా
శించుచున్నది గుడిసాధారణముగానున్నది.

అమ్మవారియెదుటి మండపమునకు దక్షిణభాగమందు సూర్యోద
యాదిరాత్రి ౧౨ ఘంటలవరకును ప్రతిదినమందును వందలకొలది మేకలు వ
గైరాజీవజంతువుల సభక్తులు బలియిచ్చుచుందురునింతకన్న ప్రత్యక్షదేవత
లేదనియు నిదేపరదేవతయనియు నిమ్మకొల్చుచుందురు సర్వైశ్వర్యసంప
న్నులనేకులుగలరు బస్తివిశేషములుచూని సంతసించసీలయును వారియున
శక్యముగానుండెను అనేకశివకేశవాది మందిరములున్నవి అనుకూలము
గా బోగరాగములుజరుగుచున్నవిబస్తిసంతోత్సవ పరిపూర్ణమైవున్నది,

ఈభువనేశ్వరిస్థలము పంచక్రోశాత్మమయిన మహాక్షేత్రముఇం
దుకోటిలింగములున్నవి వానిలోభువనేశ్వరస్వామివారి లింగము ప్రధాన
ముకనుకనే లింగరాజని ప్రసిద్ధికెక్కియున్నది స్వయంవ్యక్తమునుందుగా
బ్రంహదేవుడు దీనిబూజించెగావున బహ్మప్రతిష్ఠితమనియునందుగ్గుతక్కి
నలింగములు దేవతలుఋషులు ప్రతిష్ఠించినవి వానిలోగొన్నిభక్తజనలో
పమువల్లనానాటికిభూగతములైయున్నవి కొన్నినిధిలమందిరములైయున్నవి
కొన్నిమందిరములు శుభ్రముగానేపాయిభోగరాగాదులు లేకనేయున్నవి
యన్నియట్లున్నను సహస్రాదికలింగములు యథోచితబోగరాగములుగలిగి
యున్నవి. ఇదికేదారగౌరీపీఠము.

ఇందలి బిందుసాగరతీర్థము కాశిలో శ్రీగంగవంటిదిగానున్నది శ్రీజ
గన్నాథములోవలె నిచ్చటనైతము సర్వవర్ణసాధారణముగా ప్రసాదస్వీ
కారము జరుగుచుండుట సాధారణమయియున్నది.

శ్లో॥ బాణలింగేస్వయంభూతే చంద్రకాంతేహృదిస్థితే।
తత్రక్రతుశతంపుణ్యం శంభోర్గై మ్వేద్యభక్షణె॥
రసలింగేచబాణేచస్వయంవ్యక్తస్థలేపిచ।
నచండీచాధికారోభాగ స్తత్రగ్రాహ్యంశివాత్మభిః॥
అనియిత్యాది ప్రమాణవచనంబులుగలవు॥

అని యిట్లు క్షేత్రమహాత్మ్యమందున్నదనియు చరమశ్లోకమునందు చెప్పబడిన పదార్థములన్నియు నిత్యము భోగమగుననియుపండాలనిరి॥

శ్రీశివప్రసాదమునుగురించి.

౧ స్తావరేషుచర్వేషుశైవవైష్ణవకేష్వపి।
యధినాధరణోవిష్ణుస్తదాగ్రాహ్యంహితద్వసు॥

౨ అసాధారణత్వేవంబుద్ధిర్యదిమహాత్మనాం।
తదానగ్రాహ్యమేవస్యాత్తద్రవ్యంకణమాత్రకం।

౩ శంభుఃపరాత్పరతరస్సర్వదేవాదికఃప్రభుః।
గాయత్రీవల్లభశ్శైశోబ్రహ్మణ్యోబ్రహ్మవర్ధనః॥

౪ నగ్రాహ్యంహారవిష్ణ్వాహి నమమేతసమర్పితం।
తేనస్వస్వత్వపంత్యాగః పరస్వత్వసమర్పణం॥

౫ మహాత్మనోఽపరిత్యక్తంనగ్రాహ్యంధనమణ్యపి।
నివేదతాన్నభోక్తౄణావిప్రాణాం దేవతార్చనే॥

౬ నశాకఃప్రత్యవాయోవానాపి దేవార్ద్ధహారితా।
సంప్రోక్ష్యాన్నంవ్యాహృతిభిఃప్రదాపానాదికంచభేః॥

౭ నివేదయామిదేవేశప్రసాన్నంమహాత్మనే।
భుక్త్వాయథేష్టందేవేశప్రసాదంకర్తుమర్హసి॥

౮ ఏవంనివేదయిత్వాన్నంతదుచ్ఛిష్టంతతశ్చరేత్।
తదన్నంభుంజతాంన్యాణాంపాపంనశ్యతితత్క్షణాత్॥

౯ పవిత్రంభవతేవస్మ్ఃమలినంపతిపంచయతు।
మహాపాతకసంయుక్తంసంయుక్తముపపాతకైః॥

౧౦ జాతిభ్రంశకరైర్యుక్తంమలినీకరణైరపి।
సంకలీకరణైరన్యైఃప్రకాశకృతపాతకయిః॥

౧౧ రహస్యపాపాధ్యైఃమగమ్యాగమనైరపి।
సర్వేషామపిపాపానాంప్రాయశ్చిత్తోహినిశ్చితః॥

౧౨ శివతీర్థప్రసాదాహిభక్తానామభయంకరా।
తీర్థప్రసాదమాహాత్మ్యంశంకరస్యమహాత్మనః।

౧౩ వాలంవక్తుంవిధిర్యత్రిశివతత్వప్రకాశనాత్।
కింపునర్మాదృశాస్తత్రకీటానాంకాగతిఃపరా॥

౧౪ శివసర్వాణ్యామేకైవగంగాత్రిపథగానదీ।
పవిత్రయతిలోకాంస్త్రీన్ప్రత్యక్షంసర్వజంతుషు॥

౧౫ ఏవంతీర్థప్రసాదంశ్చలోకాన్రక్షతిశాంభవః॥ ఇత్యాది॥

౧౬ అన్నంశివార్పితంసారంపత్రంపుష్పంఫలంజలం।
యచ్చివార్పితంవస్తునిస్సారంనిష్ఫలంవిదుః।

౧౭ శివపూజాశివధ్యానంశివంస్మరణంతథా।
మహాదేవకథాసక్తిర్నాల్పస్యతపసఃఫలం॥

౧౮ జన్మాంతరసహస్రేషుతపోధ్యానసమాధిభిః।
నరాణాంక్షీణపాపానాంశివేభక్తిప్రజాయతే॥

౧౯ ముక్తిమిచ్ఛతిచేన్మర్త్యశ్శివార్చనపరోభవేత్।
శివార్చనంవినాముక్తిర్నలభ్యాజన్మకోటిభిః॥

౨౦ నరాణసహస్రేణలభ్యంకయివల్యముత్తమం।
ఈశ్వరానుగ్రహాదేవలభ్యంకయివల్యముత్తమం॥

౨౧ ఈశ్వరానుగ్రహాదేవపుంసామద్వైతవాసనా।
మహామాయాపరిక్షీణసర్వానాంనోపజాయతే॥

౨౨ దేవతాంతరభక్తిర్హిశివభక్తిర్హిదారణం।
శివభక్త్యాజ్ఞానసిద్ధిశ్శివోహిజ్ఞానదాయకః॥

౨౩ బ్రాహ్మణశ్శివభక్తస్సన్ముచ్యతేకర్మబంధనైః।
అతోన్యథావర్తమానస్సంసారాంబుధౌనిమజ్జతి॥

౨౪ యస్తుపాపీదురాచారిదేవబ్రాహ్మణనిందకః।
కథంతస్యశివేభక్తిఃకల్పకోటిశతైరపి॥

౨౫ తస్యైతానివినశ్యంతిపాపినఃపాపకారణాత్।
ఆయుశ్శ్రీర్యోయశోధయిశ్వర్యంలోకావ్యాద్ధాశివస్సుఖం॥

౨౬ దేవతాంతరమాశ్రిత్యయదిదూషయతేహరం।
తస్యజన్మసహస్రేషునరకేనియతాస్థితిః॥

౨౭ నాలంతద్రక్షణంకర్తుందేవతాంతరముత్తమం।
రాజాపచారేభృత్యానామాశ్రయస్స్వజనంయథా॥

౨౮ వతస్యపుణ్యఫలతిదూషణాగ్నినిదాహితం।
దూషకోనరకంయాతియావదాచంద్రతారకం॥

౨౯ వినింద్యశంకరందేవందక్షోజ్ఞానాతితత్పరం।
తత్పంసగణవశాత్సర్వేదేవాఅపిచసంసదీత్యాది॥
౩౦ శ్రవణాచ్ఛివనిందాయాదేవానాంగతిరీదృశీ।
కింపునర్మానవాశ్శంభునిందయాశ్రవణేనచ॥
౩౧ భృగుశ్శాపంప్రదత్వాహివినింద్యపరమేశ్వరం।
దృష్టాదక్షశిరోభంగంస్వస్యశ్మశ్రుప్రవిలోపనం॥
౩౨ భయలజ్జాపరీతాంగోదర్శనానవహానతాంగతః।
శ్మశ్రుహీనముఖందృష్ట్వావిథవాశ్చపాదినః॥
౩౩ వంధ్యాపిచషండస్యసదుఃఖైఃపరిభూయతే।
శాపందత్వాభృగుస్స్వప్రశివమాయావిమోహితః॥
౩౪ నజానాతిశివందేవంశివతత్వందురాసదమ్।
నష్టధీర్నష్టవిజ్ఞానఃప్రాకృతోమానవోయథా॥
౩౫ నచకాంక్షానపద్మాంకానవజ్రాంకాయతఃప్రజాః।
లింగాంకాంచభగాంకాంచతస్మాన్మాహేశ్వరీప్రజా॥
౩౬ అధిష్ఠానంచజగతాముపాదానంచకారణమ్।
నాన్యోఽధికోఽస్తిసర్వజ్ఞాన్నియంతుఃపరమేశ్వరాత్॥

అని యిత్యాదిశ్లోకపరంపరలచే సవిస్తరంబుగా శ్రీశివప్రసాదమహిమాదికము స్కాందధర్మఖండములో నిరూపింపబడియున్నది.

శ్రీభువనేశ్వరాలయము బహూన్నతముగాను సుందరముగాను ప్రకాశింపుచున్నది దీనిశిఖరమందు త్రిశూలంబునుగాదు చక్రంబుగాదు అది పినాకమనెడు శివధనుస్సనిపండాలు చెప్పిరి ఆలయముచుట్టును బెక్కుమందిరములున్నవి వానిలోను ౧ ఏకాంబ్రేశ్వరుడు ౨ విశ్వేశ్వరుడు ౩ ఉగ్రేశ్వరుడు ౪ ఆడకేశ్వరుడుఅనగా బాతేశ్వరుడు ౫ లవణేశ్వరుడు ౬ చిత్రగుప్తేశ్వరుడు ౭ వయిద్యనాథేశ్వరుడు ౮ శబరేశ్వరుడు ౯ జంబుకేశ్వరుడు ౧౦ సోమేశ్వరుడు ౧౧ ఉత్తరేశ్వరుడు అనియేకాదశరుద్రులును.

౧ గణేశుడు ౨ భువనేశ్వరి ౩ కుమారస్వామి ౪ వృషభము ౫ చందరుద్రుడు ౬ కల్పవృక్షము ౭ సావిత్రి ౮ లింగరాజు ౯ పార్వతి వీరందరూ యథోచితస్థానములయందుండిరి,

(గణేశప్రార్థన.)

౧ విఘ్నేశ్వర నమస్తుభ్యం సర్వసిద్ధిప్రదాయక।
అవిఘ్నం భువనేశస్య దర్శనం దేహి మే ప్రభో॥

(భువనేశ్వరీప్రార్థన.)

౨ గోపాలిని నమస్తేస్తు కృత్తివాసోనితంబిని।
పుత్రాన్ పౌత్రాన్ శ్రియం కీర్తిం దేహి మే భువనేశ్వరి।

(కుమారస్వామిప్రార్థన.)

౩ క్రౌంచహంత్రే నమస్తుభ్యం పార్వతీప్రియవర్ధన।
దేహి మే నాశ సేనానీ ర్వీర్యం తేజో బలం ధృతిం॥

(వృషభప్రార్థన.)

౪ నమస్తే పరమానంద సర్వతీర్థఫలప్రద।
యజ్ఞరోమ నమస్తేస్తు శివప్రీతిం ప్రయచ్ఛ మే॥

(చండరుద్రప్రార్థన.)

౫ చండరుద్ర నమస్తేస్తు దేవానాం ప్రీతివర్ధన।
దర్శనం తవ మే దేహి తేజో వీర్యం ధృతిం బలం॥

(కల్పవృక్షప్రార్థన.)

౬ కల్పవృక్ష నమస్తేస్తు కల్పనాసిద్ధిదాయక।
బ్రహ్మవిష్ణుశివధ్యేయ దేహి మే వాంఛితం ఫలం॥

(సావిత్రీప్రార్థన.)

౭ వేదమాతర్నమస్తేస్తు సావిత్రీరూపధారిణి।
బ్రహ్మప్రజ్ఞాం చ మేధాం చ దేహి సర్వవిభాగిని॥

(లింగరాజప్రార్థన.)

౮ కృత్తివాసో నమస్తేస్తు లింగరాజ మహేశ్వర।
నమస్త్రిభువనేశాయ నమస్తే కృత్తివాససే।
త్వద్దర్శనఫలం దేహి మోక్షసాధన మీశ్వర॥

(పార్వతీప్రార్థన.)

౯ అన్నపూర్ణే సదాపూర్ణే పుణ్యే శంకరప్రాణవల్లభే।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాం మే దేహి పార్వతీ॥

శ్రీభువనేశ్వరీ దర్శనక్రమము.

౧ వినాయకంబ్రిక్రమతో దేవీం సంపూజ్య దంపతిం తథా।
గణచండంకల్పవృక్షం గాయత్రీసాంబమీశ్వరమ్॥

౨ అష్టమూర్తిక్రమేణైవ దర్శనం క్రియతే యది।
అశ్వమేధసహస్రాణాం ఫలం ప్రాప్నోతి మానవః॥

ఈప్రకారముగా తత్తద్దేవతాదర్శనము చేయవలయును శ్రీభువనేశ్వరస్వామివారి దర్శనమునకు బోవునప్పుడు మందిరములో సోపానక్రమముగా పాతాళలోతుగా దిగిపోవలయును శ్రీకాశీకేదారేశ్వర లింగమువలెనే యీభువనేశ్వరస్వామివారిలింగము బండరాతివలెనే బారెడు వెడల్పు గలిగి గుండ్రముగా ప్రకాశించుచున్నది సర్వవర్ణ సాధారణముగా దర్శనస్పర్శన యోగ్యమయియుంచున్నది యిందునర స్థిరమందు బ్రహ్మాలయమున్నది.

గయాశిరోగయయనియు ఇక్కడికి సమీపమందున్న జాజిపూరు నాభిగయయనియు పిఠాపురపాదగయయనియు ప్రసిద్ధికెక్కియున్నవి॥

శ్రీపురుషోత్తమక్షేత్రమనబడు స్థానాంతరముగల శ్రీజగన్నాథక్షేత్రము సముద్రతీరమందు యత్యున్నతమై మోక్షద్వారమనదగు పేరుగల నీలాచలమందు శ్రీసుభద్రాబలభద్రాన్వితులయిన శ్రీజగన్నాథస్వామివారికి ఆస్పదంబయి సుందరాత్యున్నత మందిరంబునకు చుట్టు ప్రాకారముగలదయి శ్రీస్వామివారి తేరునడుచుటకు తగినవిశాలవీధిగలదయి తత్తదుత్సవకాలములయందు శ్రీస్వామివారిని వేంచేయజేయదగిన యత్యుచితోన్నతమంటపములు అనేకములుగలదయి నిరంతరయాతాయాత భక్తజనవ్రాతసమన్వితంబయి సకలసమయసర్వవర్ణసాధారణ నిశ్శంకభక్ష్యమాణ భగవత్ప్రసాదంబయి అనతిమార్గస్థానాతి సౌందర్యపురజన సందోహానందిస్తోత్రంబయి నిత్యాహోరాత్రయాత్రికప్రవర్త్యమానేక పితృసంతృప్తిసముద్యద్దండాపరనామక ముక్తికాశావహసత్యకాశాదుత్కళావనీ వరభాసురంబయి నిత్యకీర్తిప్రకాశంబయి ప్రకాశించుచున్నది ఈక్షేత్రతూర్పుగా ౩ మైళ్ళదూరము ఘోరఘాయాత్రలో శ్రీస్వామివారునివసింపదగినట్టియు నింద్రద్యుమ్న మహారాజనిర్మాపితంబులగునట్టియు మందిరంబులుగలదయి పీఠికన్న శ్రీస్వామివారికోవెల ౨ మైళ్ళున్నతము యీనీలగిరియందుబహూన్నతమయిబ

కాలువిచిత్రశిల్పానల్పంబయి యాగ్నేయభాగమందువిచిత్రవిశాల పాకశాల
గలదయి దానినయిరృతిగానక్షయవటవృక్షముగలదైవటవిటపికిబడమటి త
టమందు జ్ఞానులు పండితవరుష్ఠులు నధిష్ఠింపదగిన ముక్తిమంటపముగలద
యి దానికిబడమరగా రోహిణీమంటపభగవత్పాద మంటపంబులుగలద
యి దీర్ఘతరసన్నిధీ మంటపానుబంధంబుగలదయిదర్శనమాత్రబ్రహ్మా
నందజనకంబయి ప్రకాశింపుచున్నది గర్భాలయములో నిరుప్రక్కలను
వెనుకను ప్రదక్షిణార్హమయి కొంచెయవకాశముగలుగునట్లు మూరు
త్రి మూళ్ళయెత్తుగల మంటపముపయిని కుడివైపుధవళముఖుడైన శ్రీబల
భద్రస్వామియు నెడమవయిపు నీలముఖుడైన శ్రీజగన్నాథస్వామియునను
మపింగళముఖమైన శ్రీసుభద్రాదేవియు దారుమయోధారచారుతరమూ
ర్తులైప్రకాశింపుచుండిరి ముందుగా శ్రీజగన్నాథస్వామిని తరువాత శ్రీసు
భద్రాదేవిని కొరకు బలభద్రస్వామిని దర్శించుట యాచారమయియున్న
ది అరుణోదయమాది శయనాంపర్యంతము షట్కాలవినియోగములు శ్రీస్వామివా
రిసన్నిధిలో చెల్లింపుచుందురట భోగసమయములో చూరరానివారు అనగా
తురకలు పుష్పవతులు వేశ్యలు మొదలయినవారు తెలియక కోవెలలోసన్ని
ధికివచ్చినయెడల నదసుబోగము చెల్లనేచెల్లదట ఆపదార్థములన్నియు కో
విలయావరణములో నేయున్న పాడునూతిలో పారబోసి మరలనంతభోగము
పచనముచేసి నివేదింతురట నివేదనకాలమందు పూజాపండాలేన హస్తో
దకములో శ్రీస్వామివారిని ధ్యానించునప్పుడు ఆనీటిలో ప్రతిబింబించని నాడు
కోవిలలోనిజనులనుబరీక్షింపగా నట్టియస్పృశ్యులుదొరుకుదురట ఆరగింప
యిన వెంటనే సన్నిధిలోగాని అక్షయవటముక్రిందగాని సర్వవర్ణసాధా
రణముగా పంక్తిగూడి యెంగిలి పట్టింపులేకుండునట్లు ప్రసాదస్వీకారము
సేయుట శిష్టాచారముజరుగుచున్నదట ఇటీవల చిరకాలమునుండి భక్తిచే
తగాని రక్తిచేతగాని నక్రదర్శనముకాదగినందూరములో సైతముక్షి
నివారిసిన వ్యవస్థచెప్పుట ప్రసాదముభక్షించుట విచ్చలవిడిగా జరుగుచు
న్నది ౧ మూర్తిదర్శనమగునంత దూరములో ప్రసాదస్వీకారముసేయు
టప్రథమపక్షము ౨ కోవెలవెలపట భక్షించుట రెండవపక్షము ౩ తక్కి
నది మూడవపక్షముఅని యిట్లుపండితులు ప్రశంసింపుచుండిరి సర్వవర్ణ
సాధారణముగా ప్రసాదమునుభక్షించుటను గురించి.

శ్లో॥ ప్రవృత్తే భైరవీయంత్రే సర్వేవర్ణా ద్విజాతయః।
నివృత్తే భైరవీయంత్రే సర్వేవర్ణాః పృథక్పృథక్॥

అనెడు తంత్రశాస్త్రప్రవచనమును ప్రమాణముచేసుకొని శ్రీశంకరాచార్యస్వాములవారు యథావిధిగా భైరవీయంత్రస్థాపన చేసియుండిరిగనుక తదాదిగా నేటివరకునది సదాచారముగా జరుగుచున్నది పీఠమందు యంత్రస్థాపనయినట్లు పండాలుకూడా చెప్పియుండిరి కాబట్టి దానినిబట్టి యీలోకమున క్రిందనుదహరింపబడుచున్న బ్రహ్మాండపురాణస్థప్రసాదమహిమప్రతిపాదక శ్లోకపరంపర ప్రమాణముగా నవలంబించుటంబట్టి యీసర్వవర్ణసాధారణముగాను విచ్చలవిడిగాను భక్తులిందు ప్రసాదభక్షణము చేయుచున్నారు ఇచ్చట వర్ణభేదముల పట్టింపుగాని యెంగిలి పట్టింపుగాని లేదు.

ఇది ముక్తిస్థలంబుగావునను ముక్తిదసలో వర్ణతారతమ్యము లేదుగావునను ఇందున్నతవరకుగాని దీనిసేవించినది మొదలుగాగాని భక్తులందరును జీవన్ముక్తులయగుదురు గావునను తత్తదిచ్ఛానుకూలముగా శ్రీజగన్నాయకాన్నప్రసాదము భుజించుటకును తద్వ్యాపారించుటకును సంశయించవలదు,

శౌనక ఉవాచ.

౧ శ్రుతంమయా క్షేత్రమాహాత్మ్యం జగన్నాథస్య పావనం।
మహాప్రసాదమాహాత్మ్యం భవతానోదితంపురా॥

౨ యస్యభక్షణమాత్రేణ జీవన్ముక్తోభవేన్నరః।
మహాప్రసాదమాహాత్మ్యం శ్రోతుమిచ్ఛామివిస్తరాత్॥

సూత ఉవాచ,

3 శృణుధ్వంమునిశార్దూలా ప్రసాదమహిమాంహరేః।
యథాశ్రుతంప్రవక్ష్యామి సర్వలోకమలాపహం॥

౪ వక్తుంవర్షశతైస్తస్య సాకల్యాచ్ఛక్యతేనవా।
నారదాయపురాప్రోక్తం జగన్నాథేనయత్స్వయం॥

౫ ఏకదానారదోలోకాన్ పర్యటన్పృథివీతలే।
ఆససాదాశ్రమండో శ్రీమద్వైష్ణవసంకులం॥

౬ తత్రైనకీర్తయన్విష్ణోః కీర్తింకలిమలాపహాం।
శుశ్రావకందునాప్రోక్తం జగన్నాథస్యవైభవం॥

౭ తతోనయువేద్యమాహాత్మ్యంశ్రుత్వావిస్మితమానసః।
పురుషోత్తమంజగామాసౌయత్రదారుమయోహరిః॥

౮ తత్రగత్వామంజగన్నాథంసన్నంభక్తవత్సలం।
అసౌపీవరయాభక్త్యామహాపురుషమవ్యయం॥

౯ తతః ప్రసన్నోప్రసన్నోభగవాన్ బ్రహ్మపుత్రేణనంస్తుతః।
స్వవక్షోలంబినీమాలాందదౌతస్మైకృపానిధిః॥

౧౦ లబ్ధ్వామాలాందివ్యగంధానారదోభక్తవత్సలాత్।
ప్రహర్షపులకైర్వేభైసర్వేణేపమహార్ణవః॥

౧౧ ననర్తవాదయన్వీణాంమహతీస్వరశోభితాం।
దృష్ట్వాభక్తింనారదస్యజహర్షజగతాంపతిః॥

౧౨ జ్ఞాత్వాప్రసన్నందేవేశంహర్షనిర్భరమానసః।
మహాప్రసాదమాహాత్మ్యంపప్రచ్ఛవినయాన్వితః॥

నారద ఉవాచ.

౧౩ దేవదేవసమేబ్రూహిత్వత్ప్రసాదస్యవైభవం।
భవత్ప్రసాదమాహాత్మ్యంభవాన్వేత్తినచాపరః॥

సూత ఉవాచ.

౧౪ వనాద్యస్యవచశ్శ్రుత్వాప్రహృష్టఃకరుణానిధిః।
వహాస్యంకదయామాస స్వనివేదితవైభవం॥

శ్రీభగవానువాచ.

౧౫ బహూనిసంతిక్షేత్రాణి పుణ్యానిమమనారదా।
ముక్తిదానినృణాంవిద్ధి దేహంమెపురుషోత్తమం॥

౧౬ క్షేత్రోత్తమేస్మిన్ భూతానిస్థావరాణిచరాణిచ।
తానిసర్వాణిపుణ్యాని మద్రూపాణ్యేవనారద॥

౧౭ పురుషోత్తమయాత్రాయాం యస్యచిత్తంప్రవర్తతే।
తస్యముక్తిప్రదాస్యామికిముతాగచ్ఛతస్స్వయం॥

౧౮ బ్రహ్మజ్ఞానేనముచ్యంతేయోగినోపితకల్మషాః।
అత్రసర్వేపిముచ్యంతేమత్ప్రసాదనిషేవణాత్॥

౧౯ మత్ప్రసాదంతుయోశ్నాతియస్తుభక్త్యాప్రయచ్ఛతి।
తావుభౌపుణ్యకర్మాణౌముక్తిదాయభాదినా॥

౨౦ రథ్యాంతరేగ్నృహే వాపి వదత్తంయేనకేనవా।
మత్ప్రసాదంతుయోశ్నాతితస్యతుక్తిందదామ్యహం॥

౨౧ రథ్యాంతరేవాతితంమునీంద్ర క్రీతంచదత్తంశ్వపచేనవాపి।
యోశ్నాతిసద్యఃప్రయతఃప్రసాదంముదావహమస్మైశదదామిము

౨౨ దేశఃకాలశ్చపాత్రంచపునాతిపురుషాఁక్కిల।
దేశఃకాలశ్చపాత్రంచమత్ప్రసాదేనవిద్యతే॥

౨౩ శ్వపాకేనాపివాదత్తంమత్ప్రసాదంసుపావనం।
అశ్నీయాత్ప్రయతోభక్త్యానాత్రకార్యావిచారణా॥

౨౪ యత్రపాచయతేస్మిన్నరోభక్త్యాహంయజ్ఞభుక్స్వయం।
భోక్తవ్యంమునిభిస్సర్వైర్నాత్రకార్యావిచారణా॥

౨౫ వాంఛంతిసకలాదేవామత్ప్రసాదంసుపావనం।
యాచంతేభిక్షురూపేణకింపునర్భువిమానుషాః॥

౨౬ తపస్వినోవిరాహోలాప్రతినశ్చాగ్నిహోత్రిణః।
శుధ్యంతిమత్ప్రసాదేనకృపాదత్తేననారదా॥

౨౭ యధాసువర్ణేరత్నేచస్పర్శదోషోనవిద్యతే।
తత్తైవమమనయివేద్యేస్పర్శదోషోనవిద్యతి॥

౨౮ క్షేత్రేస్మిన్మత్ప్రసాదంయోనాశ్నాతిస్పర్శశంకయా।
అవిముక్తక్షేత్రయుక్తోవాభ్రమిభుస్సభవేన్మనే॥

౨౯ శ్వపాకోపహృతంవాపిమత్ప్రశాదంతుయస్త్యజేత్।
తస్యముక్తిఫలంహంతచ్చ్యుతమేవనసంశయః॥

౩౦ యోశ్నాతిప్రీయతోనిత్యంమత్ప్రసాదంసుపావనం।
సోశ్నాతిసర్వదాకామాన్మయాసహవిపశ్చితా॥

౩౧ మన్నివేదితభ్యాక్తారోమన్నానుజలశావినః।
మనుసాధర్మ్యమాపన్నానచ్యవందేకదాచన॥

౩౨ మన్నివేదితభోక్తారంయోదూషయతిమానవః।
సపచనరకేలోకేసావిక్రతుసహస్రిహా॥

౩౩ యధాశుష్కంతృణంపీత్యంనీతంవాదూరదేశతః।
చండాలవాటికాయాంవామత్ప్రసాదంసుపావనం॥

౩౪ మత్ప్రసాదంయధాదేవాఃపీయూషంలోకపావన।

యస్సేవతే ప్రతిదినం తస్య ముక్తిః కరే స్థితా॥

౩౫ శుచిర్వాప్యనాచారో జాత్యావ్రాత్యోపి వా పివా।
యో మత్ప్రసాదం సేవేత స ముక్తో భవేత్॥

౩౬ మత్ప్రసాద తీర్థం సేవా చమన్నివేదిత భోజనం।
దహత్యాజన్మజం పాపం తూలరాశిమివానలః॥

౩౭ నోచ్ఛిష్టదోషాస్తి న శూద్రస్పర్శదూషణం తథా।
న ప్రతిగ్రహదోషాసి మత్ప్రసాదేను పావనం॥

౩౮ అస్నాతో వ్యథవా స్నాతో మత్ప్రసాదం సుపావనం।
ప్రాప్తమాత్రేణ యోశ్నాతి స బాహ్యాభ్యంతరః శుచిః॥

౩౯ చండాలకలుషైర్యథా స్పృష్టం గంగా వారి న దూష్యతే।
తద్దైవమన్నైవేద్యం స్పృష్టం కేనాపి దారద॥

౪౦ మత్ప్రసాదేన యో విప్రో హవ్యకవ్యాదికం చరేత్।
దేవానాం చ పితౄణాం చ తదానంత్యాయ కల్పతే॥

౪౧ పితౄణాం మత్ప్రసాదేన పిండనిర్వపణం చరేత్।
ఆమాయాంత వామ్రతాహే వాతదక్షయ ఫలం భవేత్॥

౪౨ మత్ప్రసాదాద్భతే న్నేన పిత్రే శ్రాద్ధం కరోతి యః।
స చండాలో భవేద్విప్రో ఘోరం చ నరకం వ్రజేత్॥

క్షేత్రపరాయం నియమ ఇతి గ్రాహ్యం,

౪౩ యో మత్ప్రసాదం నాశ్నాతి శూద్రస్పృష్టమితి ద్విజః।
స సంక్లిష్టో భవేత్సద్యశ్చండాలాదధమో భవేత్॥

౪౪ ఉపవాసదినే వాపి మత్ప్రసాదం సుపావనం।
అయాచితాహృతం భోజ్యమనశ్నన్పతితో భవేత్॥

౪౫ చాంద్రాయణసహస్రాణి పరాకాణ్యయుతాని చ।
మత్ప్రసాదస్య సేవాయాః కలాం నార్హంతి షోడశీం॥

౪౬ బ్రాహ్మణస్తు కీటుభ్యాద్ధైర్మత్ప్రసాదాన్నభోజనే।
పంక్తిదోషో న కర్తవ్యో మద్భక్తేస్తు విశేషతః॥

౪౭ చండాలవాటికాయాం వా మత్ప్రసాదం సుపావనం।
యాచ్యం భోజ్యం ప్రతిగ్రాహ్యం మద్భక్తైర్బ్రాహ్మణైర్మునే॥

౪౮ యావత్కరే మత్ప్రసాదం వర్తతే యస్య కస్య చిత్।

తావచ్చతుర్భుజో జ్ఞేయ స్సతుభక్తై ర్ద్విజైర్మునే॥

౪౯ దేహే యస్యాపి దమనం మదీయం శతకే మునే।
ప్రదక్షిణం ప్రకుర్వీత తస్య దేహే వసామ్యహం॥

౫౦ శరీరం యస్య కస్యాపి దమనామోదవాసితం।
సగంధర్వస్సర్వజ్ఞ స్సజీవన్ముక్త ఉచ్యతే॥

౫౧ మోహాద్యస్య మహార్ఘ్నం దమనం దధాతి నయుక్తం ప్రయాత్యవ దేకిరీటవా
యోహాశ్నాతి భక్తైస్సహ మత్ప్రసాదం బ్రహ్మామృతం విష్ణుపదే పిబన్నాస్తే

౫౨ మమాన్నం నిందయేద్యస్తు మమ నిందాం కరోతి సః।
మద్దర్శనేన యత్పుణ్యం తత్సర్వం సిక్థఫలం భవేత్॥

౫౩ శుద్ధ్యంతు సర్వపాపాని మతత్ప్రసాదనిషేవణాత్।
ప్రసాదలంఘనే పాపం న శుద్ధ్యతి కదాచన॥

౫౪ మన్నామకీర్తనాబాది మత్ప్రసాదం తథోదకే।
దమనం యస్య తయి మార్గిణం న ముక్తో న సంశయః॥

౫౫ తస్మాత్సర్వప్రయత్నేన మత్ప్రసాదం సుపావనం।
భోజ్యం ద్విజైస్తు మద్భక్తైర్మత్సాయుజ్యఫలేప్సుభిః॥

౫౬ ఇతి తే గుహ్యమాఖ్యాతం మత్ప్రసాదస్య వైభవం।
యస్య శ్రవణమాత్రేణ పాతక్యపి విశుద్ధ్యతి॥

౫౭ త్వయా గోప్యం న వక్తవ్యం విష్ణోః హతాత్మనే।
శుద్ధాయ భక్తియుక్తాయ వక్తవ్యం మత్పరాయ చ॥

సూత ఉవాచ.

౫౮ ఇత్యుక్త్వా భగవాన్ తస్మై ప్రసాదం సుదుర్లభం।
దదౌ వినయనమ్రాయ కృపయా వరయా మునే॥

౫౯ లబ్ధ్వా ప్రసాదం స ముని ర్జీవన్ముక్తో బభూవహ।
ఉవాస సుచిరం కాలం గాయంస్తస్య యశోబలం॥

౬౦ ఏతత్సర్వం సమాఖ్యాతం తుభ్యం శుశ్రూషవే ముదా।
మయా వినారదాదేవ విశాలాయాం శ్రుతం మునే॥

౬౧ మార్కండేయవటే కృష్ణే రోహిణ్యాం చ మహోదధౌ।
ఇంద్రద్యుమ్నహ్రదే స్నాత్వా పునర్జన్మ న విద్యతే॥

౬౨ ద్వాదశైతాని తీర్థాని పంచతీర్థమితిస్మృతం।
సేవనం పంచతీర్థస్య కలీనాంచపావనం॥

౬౩ జగన్నాథముఖాత్స్పృష్ట్వా దేశాంతరగతోఽపివా।
సాయుజ్యంసమవాప్నోతి దేహాంతేయోగిదుర్లభం॥

౬౪ సనపీఠేత్రవిమలాదేవీసాద్యదధిదేవతా।
క్షేత్రపాలోనృసింహస్స్యాత్ జగన్నాథశ్శివస్స్వయం॥

౬౫ నీలాచలనివాసాయ నిత్యాయపరమాత్మనే।
సుభద్రాప్రాణనాథాయ జగన్నాథాయమంగళం॥

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే విష్ణురహస్యక్షేత్రమాహాత్మ్యే మహాప్రసాదవైభవనామ చత్వారింశదుత్తరద్విశతతమోధ్యాయః॥ ౨౪౦॥ అధ్యాయమునందు ఇట్లుచెప్పబడియున్నది.

పైని వ్రాసినశ్లోకములప్రకారము నారదమహాముని శ్రీ జగన్నాథముఖవచనంబులవలన తదీయప్రసాదమహిమను సమగ్రముగా నెరింగియునంతరమందు నిజాభిప్రాయము సూచించుచుగా ముక్తిచింతామణియనుపేరుగల నొకగ్రంథము రచియించి దానిలో శివేశవ్యాసాది మహర్షిప్రణీతబహుపురాణేతిహాసాదిప్రమాణంబులుదాహరించియుండెను అవియెయ్యవియన్నను.

౧, బ్రహ్మాండపురాణము. ౨, కాశీఖండము. ౩, గరుడపురాణము ౪, పద్మపురాణము, ౫, విష్ణురహస్యము, ౬, స్కాందము, ౭, బృహద్విష్ణుపురాణము, ౮, వాయుపురాణము, ౯, తత్వయామళము, ౧౦, శివపురాణము, ౧౧, విష్ణుపురాణము, ౧౨, కూర్మపురాణము, ౧౩, విష్ణుధర్మము. ౧౪, బ్రహ్మాండపురాణము, ౧౫, బ్రహ్మయామళము, ౧౬, పురుషోత్తమక్షేత్రమాహాత్మ్యము, ౧౭. భవిష్యత్పురాణము, ౧౮. అంగిరసపురాణము, ౧౯, బృహద్యామళము, ౨౦, ఆగ్నేయపురాణము, ౨౧, నృసింహపురాణము, ౨౨, లఘుభాగవతము.

వీనిలో ప్రధానముగా క్షేత్రమహిమ విశేషించిచెప్పబడియున్నది.

౧. పద్మపురాణములో శ్లోకము,

౧ యస్మాదన్నపతిర్దేవో జగన్నాథో జనార్దనః।
అన్నపూర్ణా సుభద్రాస్యాత్తౌ వినాన్నముత్సృజేత్॥

అని శివకేశవులకు అన్నపూర్ణా సుభద్రలకు భేదములేదని చెప్పబడినది. మరియునందే,

౨ కింక్లిశ్యంతి జనా దేవి సంసారవ్యాధిపీడితాః।
నియతం ముక్తిమేష్యంతి జగన్నాథాన్నభక్షణాత్॥

౩. అవిముక్తే మృతానాం తు యథా ముక్తిర్ధ్రువా మతా।
నియతం ముక్తిభాజస్తే జగన్నాథాన్నభక్షకాః॥

అని యిట్లు చెప్పబడియున్నది

౪ వరాహపురాణము, రుద్రయామళము, బ్రహ్మరహస్యము, స్కాందము, వీట్లలో వ్యాసాగస్త్య శాండిల్యసూక్తులు ప్రసాదమహిమనుగురించి పెక్కుగానున్నవి.

౫ విష్ణురహస్యసుందరి ౨౮౦ అధ్యాయముపైని వ్రాయబడియున్నది గదా అది ౧౫వ అధ్యాయమని చింతామణిలో నున్నదిగాని శ్లోకములు అవియేయున్నవి.

౬ భగవదింద్రద్యుమ్నసంవాదము - బ్రహ్మపురాణము - బ్రహ్మాండపురాణము - ఇందు డోలోత్సవాది ప్రశంస విశేషించికలదు.

శ్లో॥ డోలాయమానం గోవిందం మంచస్థం మధుసూదనం।
రథస్థం వామనం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే।

౨ శయనోత్థాపనే కృష్ణం యే పశ్యంతి మనీషిణః।
హలాయుధం సుభద్రాం చ హరేః స్థానం వ్రజంతి తే॥

అని యిట్లు తత్తదుత్సవములయందుగాని ప్రతిదినప్రతినములయందుగాని దర్శనము చేసినవారికి గలుగు ఫలములు విశేషించి చెప్పబడియున్నవి.

౧ దివా చ దర్శనం పుణ్యం రాత్రౌ దశగుణం భవేత్।
విష్ణుసాయుజ్యమాప్నోతి దృష్ట్వా దేవం యథా తథా॥

౨ నాతః పరతరం కించిత్ పుంసాం కర్తవ్యమస్తి హి।
నీలాచలం నికృష్టాత్మా జగన్నాథావలోకనాత్॥

విష్ణుయామళము.—బ్రహ్మపురాణములోనుప్యాన వాక్యము.

3 క్షేత్రరాజ స్తవక్షేత్రం దీర్ఘరాజో మహోదధిః।
వృక్షరాజోవటస్సోయం దేవరాజోథవాక్ప్రభో॥

౪ నమస్తేవాసుదేవాయ నమస్సంకర్షణాయచ।
ప్రద్యుమ్నాయనమస్తుభ్యం మాంసముద్ధరసంసృతేః॥

౫ నీలాచలశిరోరత్నం నిత్యముక్తనిషేవితం।
సుభద్రారామసహితం త్వాంత్సేవ దైకృపానిధిం॥

౬ ధన్యోస్మికృతకృత్యోస్మి త్వత్పాదాంభోజసేవనాత్।
తీర్థయాత్రాదినఫలా దేవదేవనమోస్తుతే॥

అని యిట్లు విశేషములున్నవి.)

బ్రహ్మరహస్యమునందు బ్రహ్మవాక్యమున్నది.

౭ అహోక్షేత్రస్యమాహాత్మ్యం మహాజ్ఞానసగోచరం।
కోవావర్ణయితుంశక్తో విష్ణోర్నామయుతైరపి॥

౮ పుణ్యాయంతేచపాపాని ప్యాత్యోర్వేదోత్తమాయతే।
మోక్షాయతేచసంసారః పురుషోత్తమవాసినామ్॥

౯ జపోజల్పఃపదవిన్యాసః ప్రదక్షిణపరిక్రమః।
శయ్యా ప్రణామఃపానంచ భక్షణంయజ్ఞఉచ్యతే॥

౧౦ నిద్రానమాధిస్త్రీసంగః పరమానందనిర్వృతిః।
సర్వకర్మాణిధన్యాని క్షేత్రేశ్రీపురుషోత్తమే॥

౧౧ అహోభాగ్యమహోభాగ్యం పురుషోత్తమవాసినాం।
నాస్తికృత్యంపరంతేషాం సాంనిధ్యాజ్జగదీశితుః॥

అని యిట్లు క్షేత్రవాసుల మహిమ చెప్పబడియున్నది.

బృహన్నారసింహపురాణములో.—

—( నారదసూక్తి )—

౧ కింవచ్మితస్యమాహాత్మ్యం క్షేత్రస్యనృపనందన।
యన్నామకీర్తనాజ్జీవనీయంతేనకలౌనరః॥

౨ నస్థాననియమస్తత్ర క్షేత్రేశ్రీపురుషోత్తమే।
యత్రకుత్రాప్యనూం ప్రత్యక్షా యే కేచిత్పురుషాధమాః॥

న పవిత్రాత్ములయి మహాత్మ్యముల్యంబునొందగలరు కాబట్టినీవిత్వ్యతచ్చటికిబో వచ్చు వానిమహిమనీవు సైతమహా శ్వర్యంబుగాగలదునీయందుబ్రపన్నుం డనయి యీరహస్యం బెరింగించితినని యిట్లానతిచ్చి యచ్చుతుడ్బ్రహ్మాండం తహిక్కతుండగుదురిచ్చవడి యచ్చుతురాస్యాండచ్యుత నిష్టంబై నయానిర్దు ష్టఫలంబువకుంబోయి తదీయమహిమలకును పూర్వోక్త పూర్వమూర్తి దర్శనంబునకునుమహాశ్చర్యంబునొందికృతార్థుండయ్యెననియిట్లుబహు కారణ పూర్వకంబుగా బ్రశంసించుటయేగాక ౧౯ అధ్యాయమందు,

౧ సుభద్రాచారువదనావర్ణాభాధయధారిణీ లక్ష్మీఃప్రోదుర్భభూతే యం సర్వచైతన్యరూపిణీ.

౨ ఇయంకృష్ణావతారేహిరోహిణీగర్భసంభవాబలభద్రాకృతిజాతా బలరూదన్యచింతనాత్.

౩ త్రిణాంవసహతేసాహి మోక్త్రాంలీలావతారిణాంనభైవస్త్రాత్వికోపిప్రోః కృష్ణస్యచబలస్యచ॥

౪ ఏకగర్భప్రసూతత్వాద్వ్యవహారోధలౌకికః భగినీబలదేవస్యతస్యైషె పౌరాణికీకథా.

౫ పుంరూపేస్త్రీస్వరూపేణలక్ష్మీస్సర్వప్రతిష్ఠతి పున్నామ్నాభగవా న్విష్ణు స్త్రీనామ్నాకమలాలయ.

౬ దేవతిర్యఙ్మనుష్యాదౌ కవయోఽవ్యక్తేపరం కోహ్యన్యః పుండరీకాక్షాద్భువనానిచతుర్దశ.

౭ ధారయేద్యఃఫణాగ్రేణ సోనంతో బలసంజ్ఞకః తస్యశక్తిస్వరూపేణభగినీశ్రీః ప్రకీర్తితా.

౮ సుదర్శనంతుయచ్చక్రం సదావిష్ణోఃకరేస్థితం శాఖాగ్రస్తంభమ ధ్యస్థం తద్రూపంతు తురీయకం,

౯ ఏవంతుమూర్తయస్తేన చతస్రోవైత్రికాశితాః నిర్వృత్తే భగవ ద్రూపేచతుర్ధాదివ్యరూపిణీ.

అనియిట్లు సుభద్రా బలభద్రసుదర్శన జగన్నాయక మూర్తుల యొక్కయధార్థ స్వరూపమునిరూపించబడినది.

## శ్రీజగన్నాథావతారకథ.

శ్రీకృష్ణావతారకాలమందు శ్రీకృష్ణునిదివ్యసుందర విగ్రహమును జూచిసుభద్రతనమనసులోనే మోహించియుండుట సర్వజ్ఞుండైన శ్రీకృష్ణుండెరింగిపూర్వకలియుగంబున కాడియందు సుభద్రా బలభద్రులతోఁ గూడియానీలగిరియందు బుద్ధరూపంబునవతరించి (పాండ్యా) పండాలనా డు కతిపయభక్తులతో సల్లాపంబుసలుపుచు వారిచే బూజింపబడుచుండుట యింద్రద్యుమ్నమహారాజు స్వాశ్రిత బ్రాహ్మణునివలన నెరింగి సపరివారంబుగావచ్చి తదీయపామరజన సంమర్దనంబున నంతర్ధానంబునొందిన భగవంతుని బ్రార్థించుచున్న యింద్రద్యుమ్న మహారాజునకు స్వప్నదర్శనంబిచ్చి సముద్రములోనుండి కొంచెపుదినములలోరాఁగల దారువులను మూర్తులుగా నిర్మింపించి ప్రతిష్ఠించి పూజింపుమనియు మత్ప్రసాదభక్షకులై మద్దర్శనంబు సేయువారయి భక్తిగలిగియున్న యేమానవులనైనను తరింపజేసెదననియు నానతిచ్చినపైసి కొన్నిదినంబులలో భగవదుక్తప్రకారంబుదారువులు పారావారంబులోనుండి తీరంబునకురాగాచూచిసంతసించి యింతకుముందే యిందునుగురించి కట్టించినమందిరంబులో ప్రచ్ఛన్నవేషాగతవిశ్వకర్మతో సదరుదారువులను బ్రవేశపెట్టి తదుక్త ప్రకారంబున గుడితలుపులుమూసి బీగములువైచియుండగా ౧౦ దినంబులైనపిమ్మటరాజమాతమూర్తినిర్మాత నొకప్రకృతునిగాదలంచి వానినిరాహార నిర్మాణంబునకు మిగులవగచి కనికరంబునగరంబు బ్రేరేఁపగా మాతృభక్తుండుగావున నయ్యింద్రద్యుమ్నుండు తల్లిమాటనుల్లంఘింపజాలక కాలకర్మవశంబున సమయపూర్ణకాకుండనే గుడితలుపుతెరచిచూచినంతలోనే విశ్వకర్మయంతర్హితుండయ్యెనట మూర్తులును కరచరణాగ్ర పూర్తిలేక యదోచితస్ఫూర్తిగలిగియుండు ఏకాతిజంది తమ్మిచూలిపాలికా న్నృపాలమౌళి వేగనేగి మ్రొక్కి-తావచ్చినపని విన్నవించినంతలో నవ్విధాత యాతనింజూచి నీవచ్చుటనుండి యిచ్చటికివచ్చినయీమధ్యకాలంబు దేవమానంబుననల్పమాత్రంబయ్యెను మనుష్యమానంబు ననేకయుగంబు లతిక్రమించియున్నవి భగవన్నిర్మాపితమూర్తులనునీవంటిభక్తుండొకడు ప్రతిష్ఠించుటయుభోగరాగాద్యుత్సవంబులుపాండ్య(పండా)బ్రాహ్మణాశ్రితంబుగా జరుగుచుండుటయు చిరకాలముక్రిందటనే భగవత్సంకల్పంబునసం

క॥ నిగమార్థమనుచు వేల్పులు।
వొగడఁగనీలగిరిశిఖరశృంగారమణిపీఠతలంబున।
సహజాంతోఁదగినటుపై।
నిరుబ్రహ్మదారువుఁదలఁతుర॥
క॥ నిగమరసమనఁగనురరా।
స్వఁగశిలనగాగ్రశంఖనలినగతమణీ।
మృగరాజపీఠపానుజ।
మగుచునగడుబ్రహ్మదారునాత్మఁదలతుర॥

శివకేశవ స్తోత్రము.

సీ॥ సాణుస్వరూపుఁడై తనరుచుండు।
నొండుదామస్వరూపుఁడై తనరునొకఁడు।
దారుపావనమూర్తి దారకాముఁడొకడు।
పురుషోత్తమక్షేత్రనిరతుఁడొకఁడు।
శ్వేతాచలనివాసబూతాదరుఁడొకండు
నీలాచలనివాసలోలుఁడొకండు
హాలాహలాహార లీలాధికుఁడొకండు
లలితాన్నభోగలాలసుఁడొకండు॥
గీ॥ శేషభూషణుఁడొక్కఁడు।
శేషశయనుఁడొక్కఁడనంగ ననంగభఁగో।
దయములోనర్చుభువనేశ్వరిని।
జగన్నాయకునిభజింతుఁ జింతితపురుషార్థసిద్ధికొవుడు॥ ౧౦
శ్లో॥ మహాంభోదేస్తీరే కనకరుచిరే నీలశిఖరే వసన్ప్రాసాదాంతస్సహజ బలభద్రేణబలినా। సుభద్రామధ్యస్థస్సకలసురసేవావసరదో జగన్నాథస్స్వామీ నయనపథగామీ భవతు మే॥
శ్లో॥ నీలాచలనివాసాయ నిత్యాయపరమాత్మనే।
సుభద్రాప్రాణనాథాయ జగన్నాథాయమంగళం॥

అనియిట్లు ప్రార్థించుచుందురు.

క్షీరసముద్రమథనాంతరమందు మందరాద్రినిడించి జగదుద్ధరణార్థ

మై తెనబేరుగా సముద్రతీరమందు శ్రీకూర్మరూపియైన విష్ణుమూర్తియొక్క
శివలింగమును ప్రతిష్ఠించి పూజించెదననియు నిటీవల శ్రీరామానుజాచార్య
లవారు తిరుమలయందువీని నేనంవిధానము చేసి సోమసూత్రముగుండాపామై
గుడిలోపలికిపోయి శంఖచక్రాదిలాంఛనములు శ్రీకూర్మేశ్వర లింగమున
కలంకరించి మరునాడెయంగనట్టుతత్రత్యులును, తానునుగుడితలుపులుతెర
చిలీగనులుచూచువరకు విష్ణులాంఛనములుంచుండగా విష్ణువేయనినిర్ణయిం
చి తొల్లింటిశివాచారులకు సమాశ్రయణము చేసి పాంచరాత్రరీతిని దివ్య
తిరుపతినిజేసినది మొదలు శ్రీకూర్మేశ్వరనామమునకు బదులుగా శ్రీకూ
ర్మనాయకనామము శ్రీస్వామివారికి సంభవించెనని వింటిమి,

ఇచ్చట కూర్మకుండికయని యొక్క పుష్కరిణిగలదు దీనిలో విక్ర
తిసంవత్సర మాఘశుద్ధ ౧౦ కు శ్రీ కాశీగంగవచ్చును. శ్రీకాశీలో చక్ర
తీర్థమువంటిదనినమ్మి యీప్రాంతములోని పెక్కండ్రుజనులు నస్థిప్రక్షే
పణంబుగావింపుచుందురు శ్రీకూర్మమునకు తూర్పుగా ౧౦ మయిళ్ల
దూరములో సముద్రతీరమందున్నది.

ఈక్షేత్రమునుగురించిన కథ.

పూర్వకాలమందు శ్వేతకేతుడను మహారాజుయొక్క భార్య సభ
క్తికముగా నమసవ్రతములొనరించి యొకనాడొకగోవ్రతదీక్షతో నిలచుండ
గా శ్వేతకేతుడు మీనకేతుపీడితుండై యారాత్రి తనభార్యకడకే తెంచుత ం
పునన్మద్యుక్తుండై యుండగా తద్భార్యకు వ్రతభంగము కారుండునట్లాదంప
తులనడుమనొక మహాజలప్రవాహముదయించెనట దానినింజూచి భూజాని వి
స్మితుండయి శ్వేతగిరికెక్కిపోయి యందున్న పెద్దలనడుగగా వారునీ భార్యకు
వ్రతభంగమురాకుండకయి సర్వేశ్వరుండే యావిధంబున మహాజలప్రవా
హంబు కల్పించినాడని తెలిపిరట. ఆమాటవినియామేటినివ్వెరపాటునం బా
టిల్లినతనయుల్లంబున శ్రీలేయాశ్వరుని స్వాధీనునిగా జేసికొనుచుండగా
పురుషులకదికష్టమాయునితలంచి నిశ్చలతపశ్చరణ నిశ్చితాంతరంగుండై యి
చ్చటికిదురంగటనున్న కళింగపట్టణమునందు వేంచేసియున్న శ్రీ కర్పూరే
శ్వరుని సన్నిధిలో గొంతకాలంబును దానికి సమీపమునందున్న శింగుపురము
వేంచేసియున్న మధుకేశ్వరుని సన్నిధిలో గొంతకాలంబును దానికి సమీపమం
దున్న యిప్పిలియనుసూరిలో స్వయంవ్యక్తమయిన సుందరేశ్వరుని సన్నిధి

లో గొంతకాలంబును దానికి సమీపమందున్న యీ శ్రీకూర్మక్షేత్రములో వేంచేసియున్న పాతాళసిద్ధేశ్వరుని సన్నిధి గొంతకాలంబును దానికి సమీపంబున నున్న సముద్రతీరమందు వేంచేసియున్న రామలింగేశ్వరుని సన్నిధియందు గొంతగాలంబును దినదినప్రవర్ధమానశ్రద్ధాబుద్ధినై ఘోరతపస్సు చేయగా జగదీశ్వరుండు ప్రత్యక్షమయి శ్వేతకేతునకు తదభీష్టవరంబులొసంగి ఈ పంచస్థలంబులలో ప్రపంచమునంగల పంచజనులెవ్వరు నమంచితభక్తిచే స్వయంవ్యక్తముగా వేంచేసియున్న నన్ను సేవించెదరో వారికిహపర సుఖంబు లఖండంబుగా నొసంగెదనని ప్రసంగవశంబున నానతిచ్చెనట. ఇట్లు శ్వేతకేతుడు తపస్సు చేసిన పుణ్యస్థలంబుగావున నాటబట్టి దీనికి శ్వేతగిరియను పేరుగలిగెనని వింటిమి. ఇట్టి శ్వేతాచలమందున్న యీ కూర్మక్షేత్ర పూర్వమందు పూర్వము శివక్షేత్రమే నయినందుకు గురుతుగా కోవెల యావరణములోనే వాయవ్యభాగమందు శ్రీదుర్గాదేవియొక్క మందిరంబును గ్రామపశ్చిమదిశయందు కాలభైరవుని మందిరంబు గలిగియున్నావి. వీరిని బ్రాహ్మణులే పూజించుచుందురు ఇటీవల శ్రీరామానుజాచార్యులవారి కాలమునాడు ప్రతిష్ఠింపబడిన మూర్తులు.

౧. శ్రీగోవిందరాజులు - శ్రీదేవి-భూదేవి.

౨. శ్రీకోదండరామస్వామివారు - సీతాదేవి-లక్ష్మణస్వామివారు.

౩. చక్రనారాయణస్వామివారు - శ్రీదేవి-భూదేవి.

వీరందరు యథావిధిగానే పూజింపబడుచుండిరి. సముద్రతీరమందేయున్న శ్రీహనుమదాలయములో సముద్రఘోషము వినబడదు. ఇది వారి మహిమేయని యాశ్చర్యముతో నమ్మవచ్చును. దీనికి ౭ మయిళ్ళదూరములో ఎడమరగానుండు.

## శ్రీహర్షవల్లిక్షేత్రము.

శ్రీహర్షవల్లిక్షేత్రములో శ్రీగాయత్రీమంత్రాధిదేవతయైన శ్రీసూర్యనారాయణస్వామివారు ప్రత్యక్షదైవమయి ప్రకాశింపుచున్నారు. పూర్వము భారతయుద్ధకాలమందు, తీర్థయాత్రావశంబున శ్రీబలరామస్వామివారు లాంగలీతరంగిణికి దరంగటబరగుచున్న శ్రీకాకుళమునందు శ్రీ

సోమేశ్వర లింగప్రతిష్ఠ సేయుచున్నప్పుడుం తద్దర్శనార్థమయిన పరివారముగ నింద్రుడు హోమసమయంబున నిమంత్రితుండయి వచ్చి తద్దేశస్థులకు గల భక్తిశ్రద్ధావినయాభివృద్ధుల కానందభరితుండు మెచ్చి వారికాయురారోగ్యయిశ్వర్య కైవల్యంబులు గలుగుటకు సర్వాభీష్టసిద్ధియగుటకెను త్రయీమూర్తియు కరుణాసాంద్రుండును త్రిమూర్త్యాత్మకుండును భక్తరక్షణపరాయణుండునగు శ్రీ సూర్యనారాయణుని ప్రతిష్ఠించినచో నదిమూర్తిప్రతిష్ఠాఫలసిద్ధియగునని తలంచి యీశ్రీసూర్యనారాయణమూర్తి నింద్రుండు ప్రతిష్ఠించెనని బలరామక్షేత్రమహాత్మ్య గ్రంథములోనున్నది.

పద్మద్వయాభయవరదహస్తములు గలిగి మూర్తి బహుసుందరముగాను ప్రసన్నముగాను ప్రత్యక్షఫలప్రదంబుగాను ప్రకాశింపుచున్నది. నిత్యపూజయు సకలోత్సవంబులును, నియత కాలములలో యథావిధిగాను సభక్తికంబుగాను జరిగింపబడుచున్నవి. ప్రతిభానువాసరంబునందును పుల్లగొలదిగాను తథస్తుఖికిగరిశలగొలందిగాను శంఖాదిమిశ్రితమయిన తప్తక్షీరము (అమృతకుండి) శ్రీస్వామివారికారగింపుచేసి భక్తులకు వలసినంత త్రావనిచ్చుచుందురు. ఇందొక పుష్కరిణిగలదు. తీర్థంబున్నానమాయురారోగ్యములనిచ్చును శ్రీసూర్యనారాయణస్వామివారికోవిలతో సరిగా నొక శివాలయంబు గలదు పూజాదులనుకూలముగానే జరుగుచున్నవి,

శ్రీసూర్యనారాయణమూర్తి నిధ్యానించుటకు-స్తుతిశ్లోకములు.

౧ ఆదిదేవనమస్తుభ్యం ప్రసీదమమభాస్కర దివాకరనమస్తుభ్యం ప్రభాకరనమోస్తుతే॥

౨ సప్తాశ్వరథమారూఢం ప్రచండంకశ్యపాత్మజమ్ శ్వేతపద్మధరం దేవంతం సూర్యం ప్రణమామ్యహమ్।

౩ లోహితంరథమారూఢం సర్వలోకపితామహమ్ మహాపాపహరం దేవంతం సూర్యం ప్రణమామ్యహమ్।

౪ త్రైగుణ్యంచ మహాశూరం బ్రహ్మవిష్ణుమహేశ్వరమ్ మహాపాపహరం దేవంతం సూర్యం ప్రణమామ్యహమ్।

౫ బృంహితంతేజఃపుంజంచవాయు రాకాశమేవచ ప్రభుస్త్వం సర్వలోకానాంతం సూర్యంప్రణమామ్యహమ్॥

౬ బంధూకపుష్పసంకాశంహారకుండలభూషితమ్ ఏకచక్రధరం దేవంతంసూర్యంప్రణమామ్యహమ్।

౭ తంసూర్యం జగతాంనాథం జ్ఞానప్రదీపనమ్ మహాపాప హారం దేవంతం సూర్యంప్రణమామ్యహమ్॥

౮ తంసూర్యంజగతాంనాథం జ్ఞానప్రకాశమోక్షదమ్ మహాపాపహారం దేవంతం సూర్యంప్రణమామ్యహమ్।

శ్రీసూర్య నారాయణ భక్తరక్షపరాయణ జన్మాంతుజారపాయన

అనియిట్లుపఠియించుచూ నమస్కరించుచుందురు,

హంసలావల్లిక శ్రీ కాకుళము పడమర గానుమూరు రెండుమైళ్ల దూరములో లాంగవీనది తీరమందున్నది ఇందు 3 శ దేవాలయములున్నవి అందొకదానిలో శ్రీకోటీశ్వరస్వామివారిని శ్రీబలరామస్వామి వారు ప్రతిష్ఠించిరందురు దీని గాథ యెట్లన్నను॥

కురుపాండవయుద్ధ కాలమందు శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతియైయుండుటయును తన ప్రియశిష్యుడయిన దుర్యోధనుండునుసన్నిహితబంధువైన ధర్మతనయుండును యుద్ధసహాయ్యమునుగురించితన్నుగోరుటయుజూచి శ్రీకృష్ణసంకల్పమెరింగినవాడుగాన తదుభయపక్షంబులవారికిని సహాయుడుగా నేరక శ్రీబలరామస్వామితీర్థయాత్రామిషగాయరిదేరివచ్చుటలో దండకారణ్యప్రాంతమందుకొండలనడుమనడుచునప్పుడు పిపాసయుదయించి నీరులేకుండుటకు మిగులవగచి స్వార్థముగానుపరార్థముగాను మేలుసేయందలంచిగంగాతరంగిణినంతరంగంబుసస్మరింపుచు తనలాంగలముతో నచ్చటచ్చటభేదింపుచురాగా పెక్కుజలధారలుపయించి వేగవతి స్వర్ణముఖిలాంగవిని వంశధారఝంఝావతియనుపట్టి నామములుగలనదులై ప్రవహించుచుండుట గనుంగొనిసంతసించి వానిలోస్నానపానాదులేనదిలోజేసెనో దానికిలాంగవీనదయనియు సైరణియనియు పేర్లుపెట్టి మనుష్యులునోర వింధ్యారణ్యాదుల దాటినపరకును తిరుగా

గాంబున నేవచ్చి జనసంచారయోగ్యమయిన ప్రయాగవాటి (పాలె
కపాడు) అనుచోటజగద్ధరణార్థమై.

1 సిద్ధేశ్వరుడనెడు పేరుగానొక శివలింగంబును.

2 పార్వతీపురంబున కుత్తరంబుగా ౫ మైళ్ళదూరమందున్న గుంప యనునూరికి తూర్పుగా సదరులాంగవీనది నద్యంతరములోగలసి నచోటసోమేశ్వరనామక శివలింగంబును.

3 సంగమాగ్రహారంబునకు ప్రాగ్భాగమందు సంగమేశ్వరనామక శివలింగంబును.

4 పవిత్రమైనలాంగవినదీతీరంబున యీశ్రీకాకుళంబునందు కోటీశ్వరనామక శివలింగంబును,

5 లాంగవినది సముద్రునితో సంకీభవించిన తీరమందున్న కళ్లేపల్లియనుచోట మణినాగేశ్వరనామక శివలింగమును.

ఏతత్పంచలింగాములను దర్శించిపూజించువారికిహసౌఖ్యము గలుగుటయేగాక శివసాయుజ్యమునొందెదరని నిర్దేశించిమరలకురుక్షేత్రమునకుదుర్యోధనగదాయుద్ధనమయమునకులాంగలధరుండు దయచేసెనట

## శ్రీముఖలింగక్షేత్రము.

శ్రీకాకుళమునకు ఈశాన్యోత్తరముగానున్న శ్రీముఖలింగమనెడు మహాక్షేత్రము వంశధారమహానదికి ప్రాగ్భాగముగా కోటిలింగములతో నున్నది యీముఖలింగేశ్వరశివలింగము స్వయంవ్యక్తమయి భక్తులకు భక్తిముక్తులనొసంగుచున్నారు దీనిమహిమ క్షేత్రమహాత్మ్యగ్రంధమందలి విశేషముగావివరింపబడియున్నది శ్రీపర్లాకిమిడిసంస్థానాధిపతులవల్లను యీస్వామివారికి భోగరాగోత్సవాదులకుగాను కొన్నిగ్రామములు సమర్పింపబడియున్నవి ఇట్టిదేవస్థానములనేకముగా వీరిసంస్థానములో చేరియున్నవి.

శ్రీబొబ్బిలిపట్టణములో వేంచేసియున్న శ్రీవేణుగోపాలస్వామివారిమందిరము గోపురప్రాకారములలో బహుసుందరముగా ప్రకాశింపు

యున్నది. శ్రీస్వామివారికి విశేషవిలువగల రత్నాలంకారము లనేకములు న్నవి బహుమనోహరముగాను ప్రత్యక్షవరదాయకులుగానుయున్నదివ్యభా మాసమేతముగాను మూర్తీభవించియుండిరి యీబొబ్బిలిసంస్థానాధిపతు లగు కే సీ ఐ ఇ శ్రీ వెంకటశ్వేతాచలపతిరంగారావుబహదరు శ్రీమహారా జావారు ఇగదువారిచేబడిన యావత్క్షేత్రములున్ను స్వయం సేవించియుం డుటవల్లనున్ను మిక్కిలి శ్రద్ధగలుగుటవల్లనున్ను భక్తిపురస్సరముగా ఈ స్వామివారిని స్వయందర్శించి సేవించుచుండుటయేగాక పండితులను వి శేషభక్తులను ధర్మకర్తలుగా నియమించియుండుటవల్లను పాంచరాత్రార్చ నవిధ్యుక్తముగా త్రికాలములయందును శ్రీస్వామికి పూజాదికములుయ థావిధిగా జరుగుచున్నవి నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరో త్సవాద్యుత్సవములు విశేషించి జరుగుచుండును ప్రతిసంవత్సర మాఘమా సములో కళ్యాణోత్సవమున్ను, పాల్గుణమాసములో డోలోత్సవమున్ను వై శాఖమాసములో బ్రహ్మోత్సవమున్ను జ్యేష్టమాసములో సహస్రకలశ స్నానోత్సవమున్ను భాద్రపదమాసములో పవిత్రోత్సవమున్ను ఆశ్వ యుజమాసములో నవరాత్రోత్సవములో గరుడసేవోత్సవమున్ను, విశే షవినోదముగా జరుగుచుండును. రజితమయములయిన గరుడగజాశ్వాది వాహనములు తేరులువిమానము మొదలగునవి. వీరిప్రభుత్వములోబహు గా శ్రీస్వామివారికి సమర్పించబడియున్నవి. శ్రీవయిష్ణవులు, యర్చకులు యనేకవిధములయిన సౌఖ్యలు విశేషముగా యీస్వామివారి యిలాకా ను పోషించబడుచున్నారు, పుష్పవనంబులు జలక్రీడా (కుండీయను) పు ష్కరిణియు. మరికొన్ని జలాశయములున్నవి. శ్రీస్వామివారి ఖర్చులకు గాను విశేషరాబడిగల గ్రామములు ఈసమస్థానాధిపతులు పూర్వమున సమర్పించబడినవైయున్నవి.

శ్రీ రామలింగేశ్వరస్వామివారు యీ బొబ్బిలిలో నొక భక్తునిచే మందిరము కట్టించబడి అందు ప్రతిష్ఠించబడిన శ్రీ రామలింగేశ్వరస్వామివారికి భక్తులచే యథోచితమైన పూజాదికములు జరుగుచున్నవి.

## శ్రీ సింహాచలము,

శ్రీ విజయనగరము గొప్పబస్తీ విశాలముగను సర్వవస్తుసమృద్ధిగను యనేక శివకేశవాది మందిరములు గలదిగను మంచిజలాశయములుగల దిగను దినదినప్రవర్ధమానమగుచుండెను. రైలుస్టేషన్ గలదు. యిచ్చటనుండి విశాఖపట్టణమునకు బోవుత్రోవలో కొండపైని నృసింహక్షేత్రమున్నది దీనిని సింహాచలమందురు, రైలుస్టేషను కలదు. కొండమీదనుగంగధార, గోదావరిధార, కూర్మధార, మాధవధార, యాకాశధార. యను నిట్టినామములుగల యనేక జలధారలు హనుమత్కూటమునుపడుచున్నవి. పర్వతమధ్యస్థమందు దేవళము బహుసుందరముగనుండి సల్పవిశేషములతో ప్రకాశించుచున్నవి.

శ్రీ కృష్ణదేవరాయలు మొదలైనపూర్వపురాజులు చేసిన శాసనములు స్తంభములపైని యనేకలిపులతో వ్రాయబడియున్నవి. ఆదేవళమునందు వరాహ నరసింహస్వామివారు స్వయంవ్యక్తముగా వెంచేసియుండగా. ప్రహ్లాదుడు ప్రథమారాధన మొనరించినందున దీనిని ప్రహ్లాదప్రతిష్ఠయందురు.

శ్లో॥ శ్రీపాతిప్యాహరంతం, తిగశరిపునుతం, త్రాతుకామారహాస్యే విస్రస్తం పీతవస్త్రం నిజకటినికటే సవ్యహస్తేన గృహ్ణన్ వేగశ్రాంతం నితాంతం ఖగపతిమమృతం పాయయన్ స్వేనహస్తే - సింహాద్రౌ శిఖరపాలితక్షితి విహితపదః పాతుమాం నారసింహః॥

శ్లో॥ శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే।
భోగీంద్రభోగ మణిరాజిత పుణ్యమూర్తే।
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత।
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్॥ ౧

వామే శ్రియం వరిగధ త్తుర గాధిరూఢః।
పాయాత్స్వమాం ఖగధరస్థిత వేంకటేశః॥

అనునట్లు రేఖాకారంబుగా వేంచేసిన యవసరముగానున్నాడు. కొన్ని నృసింహాది సాలగ్రామంబులు స్వామివారి సన్నిధిలోనున్నవి, యీ స్వామివారిమందిరము చిన్నగుహవలెనున్నది. కొండదిగువనున్న పుష్కరిణికి నయిఋతిభాగమందు శ్రీవేంకటేశ్వరవిగ్రహ మొకటాలయమందిరములో ప్రతిష్ఠింపబడి యర్చాదిక పూజాదులు గలిగి ప్రకాశించుచున్నది. దీనికీశాన్యముగా నొకశివాలయమున్నది, గ్రామ మ్రోతులు యుత్సవములు జరుగుచుండును.

పాదగయా క్షేత్రము.

పిఠాపురము (పీఠికాపురము) ఈక్షేత్రమునందొక మంచిపుష్కరిణియుగలదు. శ్రీకుక్కుటేశ్వరాలయమందున్న స్వామి లింగము కుక్కుటాకారముగానున్నది. పార్శ్వప్రవాహము గంగయనిచెప్పునందురు. సిద్ధమయినలింగోపరిభాగమునంబడి నిగ్రహింపుచు ముక్కుగుండాకారముండును. గనుక గంగయున్నందుకిదసిదర్శనమని చెప్పుదురు.

అమ్మవారు శ్రీరాజరాజేశ్వరీ భోగరాగోత్సవము లనుకూలముగా జరుగుచున్నవి.

ఈగుడి యావరణలోనే ఈశాన్యభాగమందు శ్రీవిష్ణుపాదములున్నవి. ఇచ్చటనే పిండప్రదానంబుగావించి పుష్కరిణిలోబడవైతురు. విష్ణుపాదములీపుష్కరిణిలోనేయున్నవనియు దత్ప్రతినిధులైన యీ పాదముల యందుగాని బసలోగాని పిండదానమొనరించి పుష్కరిణిలో వయిచుట యాచారమయియున్నది. గయశిరోగయయనియు జాజిపూరు నాభిగయ యనియు యిదిపాదగయయనియు ప్రసిద్ధికెక్కియున్నవి.

(రాజమహేంద్రవరము.)

శ్లో॥ త్రియంబక జటోద్భూతే గౌతమస్యాఘనాశని।
సప్తధాసాగరంభితాం గోదావరి నమోస్తుతే॥

శ్లో॥ రేవాతీరే తపఃకుర్యా న్మరణం జాహ్నవీతటె।
ఆనందద్యా త్కురుక్షేత్రే గౌతమ్యాం త్రితయంవరమ్॥

ఇత్యాది మహిమాస్పదంబగు గోదావరి (అఖండగౌతమీ)స్నాన మున్ను కోటి లింగములను సేవించి పూజించుటయున్ను సదాచారమై యున్నది.

ఇచ్చటనుంచి పడవమీదను అయిదు దినములు గంగ
కెదురుగా బోయినను శ్రీ భద్రాచల
క్షేత్రమునకు చేరుదురు.

## శ్రీ భద్రాచల మహాక్షేత్రము.

శ్రీరాములవారు వనవాసముకేగినపుడు శ్రీ సీతాలక్ష్మణసమేతులై ఇచ్చటకొంతకాలము నివసించి మహర్షులచేతను బూజించ బడుచుండిరి. యీకోదండరామమూర్తి వారి మందిర ప్రాకారములు సుందరముగానుండెను. భోగరాగాద్యుత్సవము లనుకూలముగా జరుగుచున్నవి.

శ్రీవైష్ణవులున్ను, స్మార్తులున్ను విశేషముగా నున్నారు.

ప్రతిసంవత్సరము చయిత్ర శు ౧ మొదలుకొని వసంతనవరాత్రోత్సవములో కళ్యాణము మొదలగునవిజరిగింపుచుందురు. సఖ్యాతీతముగా భక్తులువచ్చిసేవింపుచుందురు. అప్పుడుబ్రహ్మానంద జనకమైయుండును,

పరమభక్తులైన శ్రీరామదాసుగారికి ప్రత్యక్షప్రసన్నులై వరములిచ్చిన స్థలమిదేను. సమీపముగావర్ణశాలాదులున్నవి. క్షేత్రమాహాత్మ్యముగ్రంథముజూచి సంతసించవలెను.

(ఇచ్చట సంకల్పము.)

ఇహపృథివ్యాం జంబూద్వీపే భరతవర్షే భరతఖండేదండకారణ్యేగౌతమీతీరే భద్రాచలక్షేత్రే శ్రీకోదండరామస్వామిసన్నిధౌ త్రయస్త్రింశత్కోటి దేవతాబ్రాహ్మణ హరిగురుచరణసన్నిధౌ అఖండగోదావరీ స్నానమహంకరిష్యే.

మా॥ రామం శ్యామాభిరామం రవిశశినయనం।
కోటిసూర్య ప్రకాశం దివ్యం దివ్యాస్త్రపాణిం।
శరముఖశరధిం చారుకోదండహస్తం।
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం।
విఘ్నవిచ్ఛేదదక్షం భీమం భీమాట్టహాసం।
సకలభయహరం రామచంద్రం భజేహం॥ ౧

మా॥ జటాకలాపశోభితం సమస్తపాపనాశనమ్।
స్వభక్తభీతి భంజనమ్ భజేహ రామమద్వయమ్॥ ౨

మా॥ భక్తిగ్రస్తముక్తివిధాయినీ భగవతీ శ్రీరామచంద్రస్య।
హేలోకాఃకామదుఘాంఘ్రిపద్మయుగళీం।
సేవ్యాగ్ర్యవత్యుత్సుకాః నానాజ్ఞానవిశేషమంత్రవితతిం।
త్యక్త్వాసుదూరేభృశం రామం శ్యామ।
తనుంస్మరాది హృదయే శాంతంభజధ్వంబుధాః॥ 3

ఇటులధ్యానింపుచు సేవించవలయును, ఇచ్చటనుండి తిరుగా పడవపై రాజమహేంద్రవరముకె చేపటసౌఖ్యముగానుండు, మహారణ్యముగా వునఃనాటుతో ప్రయాణము పోజాలరు.

బెజవాడనంచు శ్రీకృష్ణానదిలోస్నానముచేసి శ్రీకనకదుర్గాలంకా శ్రీమల్లికార్జునస్వామి భ్రమరాంబాసహితముగా కొండపైనివేంచేసి యున్నారుదుని అప్పటికిపోయి సేవించవలయును పూర్వము దిక్కునుండు కొంతకాలము తపస్సుచేసి వరములు పొందియున్న యింద్రకీలపర్వతము యిదేయని అందురు.

శింగరాయకొండ శ్రీ వరహానృసింహక్షేత్రము.

కొండపయిని ఖరదూషణాది వధానంతరమందు శ్రీరాములవారు ప్రతిష్ఠించిన శ్రీవరాహనృసింహస్వామివారి మందిరమున్నది. దీనిదక్షిణ పార్శ్వమందే యిందిరామందిరంబుగలదు, ౭ అంతస్తములుగల గోపురమున్నది.

ఈగుడివెనుక భవనాశనియనెడు పుష్కరిణీయొకటిగలదు, కొండపైనాగ్నేయభాగమందు నృసింహస్వామి గుడిమిద్దెమీదనేకుచుగానున్నది.

ఇందులో నొక గుహకలదు, గుహద్వారమందు దమ్మవాని విగ్రహమున్న
ది, యీగుహ యొక్క పశ్చిమముగానున్న వేదగిరి నృసింహస్వామివారి
మందిరము కలదు మన్నదట ఇదిగాక యీమందిరములోనే దక్షిణశిరస్సు
గా శ్రీరామవిగ్రహము సాగ్రభిముఖముగా శయనించినట్లున్నది, కిరాటి
నృసింహస్వామియొక్క శిలావిగ్రహము కూర్చున్నయాసనరముగా సుంద
రముగానున్నదిగాని యుంచుకంటె భీకరముగా గనబట్టుచున్నది, ఈస్వామి
నిపూర్వమందు ఖరాసురుడు పూజించుచుండెనట, యిచ్చటికిపూర్వమున
మయిళ్లదూరములో నిమిదమునోరసి రెయ్యకొండ సముద్రమై ౩
మయిళ్ళపదరముగలిగి కిరాటికోటనెడు పేరుకలిగియుండె. అది ఖరాసురు
ని రాజధానియట ఖరాసురునికపుడు నృసింహస్వామియొక్క తీక్ష్ణదృష్టి
చేత జలయానములకు హానికలుగుచుండగా నారదుడు లోకోపకారార్థ
మయి తనతపోమహిమచేత శాంతిమూర్తిని గావించి యీపర్వతముమీ
ద ప్రతిష్ఠించగా వీనిచేస్థున శ్రీరాములవారుగూడ వరాహనృసింహస్వా
మిని ప్రతిష్ఠించినట్లుచెప్పుదురనిరి.

కిరాటిమొదలు కడపజిల్లావరకును గ్రామదానములరాజ్యమనియు
నిచ్చటికి పశ్చిమముగా కొంతదూరములోనున్న సేనంపాలెము ఖరాసు
రునిసేనాధిపతియొక్క నివాసస్థలమనియు దానికిసమీపమందున్న ముట్టు
రుపేటకోవి చతుర్భాగస్నానమునరించినదనియు నిదర్శనముగా జెప్పు
చున్నారు. యథావిధిగా శ్రీస్వామివారికి పూజాదులునియతకాలములలో
జరుగుచున్నవి.

నెల్లూరుజిల్లా స్థలమునందున ఖచ్చేరీలన్నియున్నవి, దీనికి పశ్చి
మోత్తరభాగముల మొరసి సుప్రసిద్ధమగు పినాకినీనది (పెన్న) ప్రవ
హించుచున్నది. ఇచ్చటికి పశ్చిమవాయవ్యముగ ౧౦ మయిళ్ళదూరమం
దున్న వేదగిరియనెడు కొండమొదలుకొని నెల్లూరువరకు పెన్నలోబడిన
యిసుకలు శిలలగుననియు పినిలోనే మరియొకచోటబడిన యిసుకలుశిల
లుకానేకావనియు వేదగిరికుత్తరముగ మయిలుదూరముగ నద్యుత్తర
తీరమందున్న జొన్నవాడలో మల్లికార్జునస్వామియు ప్రత్యక్షదేవతనై
న కామాక్షియు వేంచేసియుండిరి,

పెక్కండ్రుభక్తులిచ్చట తపస్సుచేసి ఫలసిద్ధినొందిరి, పెన్న, బొగ్గేరు, చెయ్యేరుసంగమయినచోటు సంగమేశ్వరస్వామి గుడిగలసంగమనెడుమహాస్థలము జొన్నవాడకు సమీపముగానుత్తరమందున్నది, పెన్నకు దక్షిణతీరమందున్న రంగనాయకులవారిని వేదగిరి నృసింహస్వామిని జొన్నవాడకామాక్షి మల్లికార్జునులను, నెల్లూరు మూలస్థానేశ్వరునికశ్యపబ్రహ్మ యిచ్చట యజ్ఞముచేసి ప్రతిష్ఠించెను. శ్రీరాములవారు సీతాన్వేషణకాలమందు సింగరాయకొండనుండివచ్చి యీదేవతలను సేవించినారు, స్థలపురాణములో నిదియంతయు వ్రాయబడియున్నదనిరి.

## —( శ్రీకాళహస్తి మహాక్షేత్రము. )—

దక్షిణకైలాసమనియు శ్రీపురమనియు, విష్ణుపురమనియు మండలేశ్వరమనియు, కైలాసమనియు, యిత్యాదిపురాణప్రసిద్ధనామములుగలవు.

మూ॥ శ్రీమద్దక్షిణకైలాసం సర్వలోకోత్తమోత్తమమ్।
పంచయోజనవిస్తీర్ణం దశయోజనమాయతం।
బ్రహ్మణాసహస్వత్వా నజ్రీనా లీలయాపి చ।
కాళేనహస్తినాచయివ గంధర్వదానవైః।
మునిభిఃపూజితంస్థానం భుక్తిముక్తిఫలప్రదం।
అనాపపద్మయోషిస్సు స్సహాసర్వజగత్పతిః॥

రిత్యాది మహిమాస్పదమై.—

మూ॥ సువర్ణముఖరీలోకానాం భాగధేయావియన్నదీ।
అగస్త్యేన భువంనీతా ముఖరీకృతదిఙ్ముఖే॥

ఇత్యాది నిత్యస్తుత్యప్రభావసంపన్నోత్తరవాహినీయాత సువర్ణముఖరీ పూర్వతటమందు బహూన్నతగోపురప్రాకారములు గలిగి మిగులమనోహరంబుగా మందిరంబుప్రకాశింపుచున్నది, ఇందు పశ్చిమాభిముఖంబుగా శ్రీకాళహస్తీశ్వర నామముగల స్వయంభూ శివలింగముగలదు ఇదివాయులింగమందురు, అందుకు నిదర్శనంబుగా స్వామివారికెదురుగానున్న ద్వారమందిరుప్రక్కలనుంచబడిన దీపశ్రేణులు నిశ్చలమయి

శ్లో॥ పశ్యమూభిముఖంలింగ కాళహస్త్యేంముదా।
స్మృత్వాపిసద్యస్సాపేక్షా ముక్తోథవతిసర్వదా॥ ౬

శ్లో॥ నదృష్టం యేనతల్లింగం తస్యజన్మనిరర్థకం।
నార్చితం యేనతల్లింగం జీవన్నపిమృతోహిసః॥ ౭

శ్లో॥ యంయంకామయతేకామం ప్రాణివిశేషతః।
తత్తత్ప్రమాన కోణేతు తంతంకామం నవిద్యతే॥ ౮

శ్లో॥ తస్మాత్షుదంకామదంచ తత్క్షేత్రమనుత్తమ॥ మిత్యాది. ౯

(మరియొక్క విశేషముగలదెట్లన్నను.)

శ్లో॥ అర్కద్రోణప్రభృతి కుసుమైరర్చనంతేవిధేయం।
ప్రాప్యంతేనస్మరహర మహామోక్షసామ్రాజ్యలక్ష్మీః।
ఏతజ్జానన్నపి శివశివవ్యర్థయన్కాలమాత్మ।
ద్రోహీకరణ విషశోభూయ సాధః పతామి॥

అని శ్రీమదప్పయ దీక్షితులవారాత్మార్పణ స్తుతిలో జెప్పినవాక్యాన శ్రీశివప్రీతికరములయిన ద్రోణపుష్పములు (తుమ్మిపువ్వులు) సర్వకాలములయందు సమృద్ధిగా నిచ్చుటద్రోయకును.

శ్రీ వేంకటగిరి మహారాజధానిలో వేంచేసియున్న శ్రీ కాశీవిశ్వనాథస్వామివారు, శ్రీ వరదరాజస్వామివారు, శ్రీ తంబనేయ స్వామివారు మొదలగు దేవతాద్యుత్సవములు, అత్యంతవినోదముగా జరుగుచుండును.

శ్రీ కాశీ విశ్వనాథస్వామి వారి కళ్యాణమహోత్సవము ప్రతిసంవత్సర జ్యేష్ఠ శు ౧౧ మొదలు పున్నమవరకును లోకోత్తరముగా జరుగును. బంగారు నందిసేవామహోత్సవము కంచిగరుడసేవవలెగానుండును. వేనవేల ప్రజలు వచ్చుచుందురు.

శ్రీ వేంకటగిరినుండి చన్నపురిటవునకు రయిలెక్కివచ్చునపుడుమార్గమధ్యమందు చిరుతనిగుడియున్నది. అది శ్రీకుమారస్వామి వారు వెలసిన దివ్యస్థలము. ప్రతికృత్తికకును కార్తికమాసమందును విశేషోత్సవములు మిక్కిలిమనోహరంబుగా జరుగుచుండును,

శ్రీమదిందిరా సుందరీ మందిరాయమానంబగు చెన్నపురీమహారాజధానిలోః ఏకామ్రేశ్వర, కచ్ఛపేశ్వర, కపాలేశ్వర, నృసింహ, శ్రీరంగనాయక పార్థసారథి ప్రభృతి దేవాలయములు పెక్కులున్నదివి. యథాశక్తికముగా భోగరాగములు జరుగుచున్నవి.

అందులో తిరువల్లికేణిలో సుందరగోపుర ప్రాకారమంటపాలంకృతమైన మందిరంబులో శ్రీపార్థసారథిస్వామివారు సాక్షాత్కరించి భక్తజనకృతోత్సవసంతుష్టులైవరప్రదులై విరాజమానులగుచున్నారు,

ఈ ప్రపంచములో నున్న యెల్లపదార్థములున్ను యీపట్టణములో నున్నవి.

## శ్రీతిరుపతి మహాక్షేత్రము.

కొండమీద కోవెలకెదుట వేయికాళ్ళమంటపమున్నది, స్వామి పుష్కరిణీ స్నానము. శ్రీనివాసమూర్తి దరిశనము జేసుకొనిబహుజనులు ప్రార్థనలు చెల్లించి కృతార్థులగుచున్నారు ఉపనయన వివాహాద్యుత్సవములు క్లుప్తపరచి యొకదినములో నేజరిగించుట యిచ్చట సదాచారమయిన, మొక్కుబడిగా నున్నది.

కొందరు కాశీఖండ. కాళహస్తి, కాంచీ, మొదలయినమహాత్మ్యాదిగ్రంథము లాధారంబుగా శ్రీ వేంకటేశ్వరునిను కుమారస్వామిని గాను వరాహస్వామిని క్షేత్రపాలకునిగాను పుష్కరిణిని స్వామి పుష్కరిణిగా నున్నస్థలపురాణము చెప్పుచున్నదనియు పూర్వమీశేషగిరియందుదక్షిణమున బ్రహ్మయు, నడుమ నహోబలనృసింహస్వామియు నుత్తరమున మల్లిఖార్జునస్వామియు నివసించియుండగా శివదర్శనార్థియైవచ్చినబ్రహ్మతో నీవెవ్వరవని కుమారస్వామి ప్రశ్నించగా సకలవిద్యలనెరింగిన బ్రహ్మను నేననియనగాగోపించి కుమారస్వామి బ్రహ్మను చెరసాలలో నుంచినపైని కొంతకాలంబునకు నందికేశ్వరుడువచ్చి సృష్టికర్తయైనబ్రహ్మనుచెరసాలలోనుంచదగునాయని పల్కగా కుమారస్వామికోపించి నీవున్నుబ్రహ్మయొద్దనే చెరసాలలోచేరవలసియున్నట్లున్నదని రక్షింపగా భయపడిమాటవాసికంటినిగాని నాకేల యీవృత్తాంతమని నందికేశ్వరుడుతొలగిపోగాసృష్టి

నే నే చేయుదునని భీష్మించి కుమారస్వామి బ్రహ్మస్థానమైన ఈ వేంకటాచలమందు ప్రవేశించియుండెననియు, మూర్తికి జటామండలంబును, కుడిచేతిక్రింద శివలింగంబునునున్నవి గావున యావచ్ఛరీరమువిడిచి కుడిచేతిలోనే ప్రాతఃకాలమందుబిల్వపూజయు నితరకాలములయందు పుష్పాదిపూజయుజరుగుచున్నవనియు, జనమేజయునికాలమందు జంగములే పూజకులుగానుండినందున స్వామివారిచిట్టాలేనిదర్శనమనియు తల్లియైన పార్వతికిప్రీతికరమైనసింహవాహనము శుక్రవారమునా దభ్యంజనాద్యుపచారములు జరుగుచున్నవనియు రామానుజులవారినాడు స్థలవాసులకున్ను వారికిన్ని జరిగిన వివాదములో శంఖచక్రములు, డమరు, త్రిశూలములు, కోవెలలోబెట్టి యుభయకక్షిదారులు, బీగములువేసికొనిరాగా, రామానుజులవారు శేషావతారముగనుక సోమసూత్రముగుండా రాత్రి లోపలికిప్రవేశించి, శంఖచక్రములుస్వామికలంకరించి మరలతొరిగి యెరగనట్లుబయటపోయెను.

మరునాడుభయవాదులుచేరి బీగములుదిగి విచూడగా శంఖచక్రములుస్వామిధరించినట్లుండగా నిది విష్ణుస్థానమని నమ్మించిరిగనుక, తదాదిగాజంగములు సమాశ్రయణమై కొల్చుచుండిరనియు, స్వామివారి చేతిక్రింద లింగము నుగనుపడకుండునట్లును స్వామివారిపాదములు మునుగునట్లును, రాకట్లుగా బీరముగట్టించిరనియు, విష్ణువిశేషనామంబు లనేకంబులుండినను, పాపహరుండను నర్థంబునెరింగింపుచున్న శ్రీ వేంకటేశ్వరనామంబు సర్వదేవసాధారణంబుగా నుంచిరనియు.

శ్లో॥ సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే।
సర్వపాపదహాయస్మాత్తస్మాద్వేంకట ఇష్యతే॥

అను వచన మిందుకు నిదర్శనమనియు నిట్టిగాధలు పెక్కు.గా జెప్పి ఈ వేంకటేశ్వరులవారు కుమారస్వామి వారగుటకు సందియంబు లేదని యీ ప్రాచీనస్థలపురాణములో నిట్లనే యున్నదనియునందురు.

మరికొందరు విష్ణుమతస్థులు భృగుమహాముని శాపునకుసహింపక శ్రీవిష్ణువక్షస్థలనివాసినియగు లక్ష్మిచిరుతానూరిలో నలమేల్మంగయను పేర

ప్రవేశించియుండగా విరహమునుసహింపజాలక విష్ణుమూర్తి తదన్వేషణ
తత్పరుడయి తత్తరంబుగా నిత్తిరుమలయందు దుముకగా పాదంబులును
నిగియున్నవనియు నిత్యము స్వామి యీఅమ్మవారి యొద్దకుపోవుచు వ
చ్చుచుండుననియు రాజపోకలవల్ల స్వామివారియొక్క శిథిలమయినపాద
రక్షలు మొకటిగోపుర ప్రమంటపములోనే యుండుననియు వేంకటేశ్వ
రుల వారిసన్నిధిని వరాహస్వామియుండగా, కొండను హత్తిపడమర
గానున్న వేదాచలముపయిని స్వామివారు మొట్టమొదట నిలిచినదానిం
చి ఈవరాహస్వామి వారికి దక్షిణపార్శ్వమందు చేంటలు దుమికిరనియు
వేదాచలముమీదనే యుండకాలములో స్వామివారికి ప్రీతిగా ఛత్రము
కొన్నిదినములుంచి పూజింతురనియు వరాహస్వామికెదురుగా, వరాహ
పుష్కరిణియు దానినిహత్తి యీస్వామివారియొక్క స్వామి పుష్కరిణి
యునుండుచుండగా నడుమనున్నగట్టుకొట్టి ఇటీవల రెండుపుష్కరిణులనొ
కటిగా జేసిరనియు కపిలతీర్థాద్యనేక దివ్యస్థలములు కొండపైనుండెననియు
నొకపురాణమునందున్నదని చెప్పుటయేగాదు. బింబపూజలేదని కొందరు
ను కలదని కొందరును సందిగ్ధముగా కొందరు అనుచుందురు. చేతిక్రింద
లింగములేదనియు నందురు.

కొందరు సమరసబుద్ధిగలవారు శ్రీనివాసమూర్తి విష్ణువయినందు
న వక్షస్థలమందు లక్ష్మియున్నదనియు శివుడయినందున జటలు, బిల్వపూ
జయుగల్గియున్నదనియు, కుమారస్వామియైనందుకు స్వామియనగాకు
మారస్వామిగనుక తన్నామచిహ్నితమైన స్వామిపుష్కరిణియున్నదనియు
ఆదిశక్తియైన పార్వతియొక్క లీలావతారములలో (యాపేమాశాస్వయం
విష్ణుః) అనేకపురాణమునుబట్టి యొకలీలాపురుషావతారమయిన ఈ వేం
కటేశ్వరులవారికి శ్రీదేవీచిహ్నములయిన సింహవాహనము విమానశిఖ
రమందు కలశములుశుక్రవార మంగళవారములయందు నభ్యంజన పుర
స్సరముగా విశేషపూజలున్నవనియు మొక్కువారికి నిర్విఘ్నముగా కో
ర్కెలీడేర్చుటవలన విఘ్నేశ్వరుడగుటకు సందియము లేదనియు దివ్యప్రతా
పము త్రిమూర్త్యాత్మకత్వము మొదలయిన మహత్త్వము లున్నవిగా
నూహింపనవచ్చుననియు. నిట్లు సయుక్తికముగా ప్రశంసింపుచున్నారు.

జగదీశ్వరుడొక్కడే కాబట్టి, యెవ్వరెట్లుభావించి సేవించినను భావనాను
రూపగతి గల్గుటకు సందేహంబులేదు.

శ్రీ స్వామిసన్నిధిలో నిలువుపాడవుగా వస్త్రముతో డబ్బియను
పేరుగ జోలెకట్టియున్నది దానిలో ప్రార్థనా ద్రవ్యములు సమర్పించు
చుందురు.

కొండదిగువ దిగువతిరుపతియనునూరుగలదు. ఇచట కొందరుయ
తులు మహంతులు, ధనికులు, వర్తకులు నివసించియున్నారు, జనమేజ
యప్రతిష్ఠితమయిన శ్రీకోదండ రామస్వామివారి మందిరము దివ్యముగా
నున్నది.

శ్రీగోవిందరాజస్వామివారు కంచము తలక్రిందనుంచికొని దక్షి
ణశిరస్సుగాను, ప్రాగభిముఖముగాను, పవళించియున్న లీలగానున్నది. శ్రీ
భూదేవులు పాదములొత్తుచున్న రీతియుగలదు, మందిరంబు సుందరం
బుగాను విశాలముగానున్నది.

గొప్పగోపురముకలదు, ఆగోపురమునకెదురుగనున్న శ్రీ పాదతీర్థ
మని యొకమండపము నిలువులోతుగా నడుమ నొకస్తంభముగలిగినీరుపొంగు
చుండును. గ్రామప్రాగ్భాగమందు మరియొక పాదతీర్థమిట్లనే యున్నది
నృసింహాది దేవాలయంబులుగలవు, స్వామియెడల లోకులు భక్తిశ్రద్ధలు
గలిగి సంచరింతురు.

### శ్రీ వేంకటేశ్వర ధ్యానశ్లోకములు.

శ్లో॥ దివ్యే శ్రీవేంకటాద్రౌ జలజభవశచీప్రాణనాథాదిపూజ్యమ్।
భక్తానామిష్టదానే కరధృత విలసత్కంకణాంశకశార్ఙ్గ్యమ్।
అలమేల్మంగానాథం స్థిరదినవిసరే పూజితం సర్వదాతమ్।
వందే శ్రీవేంకటేశమ్ నియమకరుణం కోటిసూర్యప్రకాశమ్॥

శ్లో॥ నీలమేఘశ్యామతనుర్భిర్వ పద్మార్కనప్రియః।
జగద్వ్యాపీ జగత్కర్తా జగత్సాక్షీ జగత్పతిః॥
శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేర్థినామ్।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్।

## అలమేల్మంగా ధ్యాన శ్లోకము.

శ్లో॥ శృంగారాంగీ మంగళజననీం మంగళకలితా మలమేల్మంగాం।
రంగద్వేంకట రాజవధూటీం తుంగయశోధనసంగామీడే॥

అని యిత్యాదులు గలవు.

శ్రీ వేంకటేశ్వరులవారికి వత్సరద్వారము మొదలగునవి తిలక ముంచెదరు. అట్టిదినములు గుర్తెట్టి దానిని శ్రీపాదరేణువని యిచ్చుదురు, శ్రీస్వామివారి హస్తములయందు వక్షస్థలమందు శ్రీగంధపు బిళ్ళలనొత్తి యాత్రాపరులకొసంగుదురు. లేక విక్రయింతురు. వాటినిదెచ్చి పూజలో నుంచెదరు.

మూ॥ వందేశ్రీనయనోత్సవస్య శరణం శేషాచలాధీశ్వరం।
బ్రహ్మాద్యర్చిత పాదపద్మయుగళం లోకైకనేత్రోత్సవమ్॥
వాసిష్ఠైస్సనకాదిభిర్మునిగణైస్సంసేవ్యమానంసదా।
భక్తానామఖిలార్థదాయనమహం శ్రీవేంకటేశంగురుం॥ ౧

మూ॥ కమలాకుచచూచుక కుంకుమతో నియతారుణితాతులనీలతనో।
కమలాయతలోచనలోకపతే విజయీభవ వేంకటశైలపతే॥ ౨

మూ॥ సచతుర్ముఖషణ్ముఖపంచముఖ ప్రముఖాఖిలదైవతమౌళిమణే।
శరణాగతవత్సల శౌర్యనిధేపరిపాలయమాం వృషశైలపతే॥ ౩

మూ॥ అతివేలతయాతవ దుర్విషహైరతివేలకృతైరపరాధశతైః।
భరితంత్వరితం వృషశైలపతే పరయాకృపయాపరిపాహిహరే॥ ౪

ఇత్యాదులనేకముగా బఠించుచుందురు.

శ్రీమద్రామేశ్వర స్వామివారిగుడికి నాల్గువైపులను సాలుగోపురములు చిత్రముగాను, బహూన్నతముగాను, ౧౧ ద్వారములతో ౧౧ అంతస్తులుగాను విశాలముగాను ప్రకాశింపుచున్నవి. ఊరు బహువిశాలముగాను, పరిశుద్ధముగాను వినోదముగానున్నది.

ఇచ్చట ౭ తీర్థములుగలవు, వాటియందు స్నానము జేయవలశి నవారములు.—

౧ ఆదివారము కచ్ఛపేశ్వర తీర్థములోను.
౨ సో॥ ఏకామ్రేశ్వర సన్నిధిలోశివగంగా తీర్థమునందు.
౩ మం॥ రాజవీధి ఉత్తరపుకొననున్న మాంగళ్యతీర్థమందు,
౪ బు॥ రైలుస్టేషను సమీపమందున్న యింద్రతీర్థములోను,
౫ గు॥ వేగవతీనదిలోనున్న యాదవ తీర్థమందు,
౬ శు॥ శ్రీకామాక్షి సన్నిధిలోనున్న పంచతీర్థములయందు,
౭ శ్రీమదుపనిష ద్బ్రహ్మేంద్రస్వాములవారి మఠమున ఉత్తరముగనున్న సర్వతీర్థములోను,

విశేష స్నానములు సేయు విధియుంగలదు.

ఏకామ్రేశ్వామి మందిరములో ఏలాలకాంబా గంగాదేవి ప్రతిమలువిఘ్నేశ్వరకుమారాది పురుష ప్రతిబింబములు చిదంబరసభాపత్యాది లీలామూర్తులు భక్తపరంపరావిగ్రహములు శ్రీరామ ప్రతిష్ఠితాష్టోత్తర శతలింగపఙ్క్తులు ౧౦౮ లింగములతోనున్న లింగము. ౧౦౦౦ లింగచిహ్నములుగల మరియొకలింగము, ఇత్యాదిబహులింగములున్నవి.



కంచిలో ౧౦౮ శివస్థలములు ౧౮ విష్ణుస్థలములుగలవు వానిలో ప్రసిద్ధస్థలములీక్రింద వ్రాయబడినవి.

## శివస్థలములు.

౧ ఏకామ్రేశ్వరస్వామివారు అమ్మవారు కామాక్షి.
౨ కచ్ఛపేశ్వరుడు
౩ పురందరేశ్వరుడు
౪ మహాకాళేశ్వరుడు
౫ ఫణామణేశ్వరుడు
౬ ఘటాకర్ణేశ్వరుడు
౭ వ్యాఘ్రశాంతేశ్వరుడు
౮ అనవరతేశ్వరుడు
౯ కైలాసనాథేశ్వరుడు
౧౦ అగస్త్యేశ్వరుడు
౧౧ అనేకపతంగేశ్వరుడు
౧౨ జ్వరహరేశ్వరుడు
౧౩ ఉపమన్యేశ్వరుడు
౧౪ మంగళేశ్వరుడు
౧౫ సూర్యేశ్వరుడు
౧౬ చంద్రకాళీశ్వరుడు
౧౭ విష్ణ్వీశ్వరుడు
౧౮ మంగళమాధవేశ్వరుడు
౧౯ శ్మశానేశ్వరుడు
౨౦ వాలీశ్వరుడు
౨౧ వృషభేశ్వరుడు
౨౨ రామేశ్వరుడు
౨౩ [illegible]క్మనేశ్వరుడు
౨౪ ధరణేశ్వరుడు
౨౫ శత్రుఘ్నేశ్వరుడు
౨౬ సీతేశ్వరుడు
౨౭ హనుమదీశ్వరుడు
౨౮ గంగాధరేశ్వరుడు
౨౯ మన్మథేశ్వరుడు
౩౦ హిరణ్యేశ్వరుడు
౩౧ సహస్రాక్షేశ్వరుడు
౩౨ [illegible]హ్మేశ్వరుడు
౩౩ బ్రహ్మేశ్వరుడు
౩౪ రుద్రకోటీశ్వరుడు
౩౫ వీరాట్టహాసేశ్వరుడు
౩౬ మార్కండేయేశ్వరుడు
(ఇత్యాదులున్నవి.)

బహుపురాతనమైనయొకమామిడిచెట్టున్నది. దానిక్రింద గౌరీ స్తనాంకితకరకరమై కౌగలింపబడిన ఏకామ్రలింగము, వేరొకటిమరికొన్నిలింగములతోపరివేష్టితమైయున్నది అనాదికాలము క్రిందట పార్వతీలీలార్థమయిశివునికన్నులుమూయగా శివుడనవ్వియో పార్వతి నీవు విలాసమునకు నా కన్నులు మూసితివి, అవి సూర్యచంద్ర వహ్నులు గావున లోకములకు

సూర్యాదిత్యాప్తిలేక చీకటిగానైనందున కర్మకలాపము చెడి దేవతలకందరి
కినుపవాసముసిద్ధించి యనేకయుగములైనది. యింత ఘోరపాపముచేసి
వదాననయితివి సుమీయని యానతీయగా నాకీదోష మెట్లుపోవునని పార్వ
తి ప్రార్థింపగా, సత్యవ్రత క్షేత్రమందు తపస్సుచేసినయెడల నీపాపము
బోవునని శివుండనగా విని భీతిల్లి పార్వతియంతర్థానమై యీ కాంచిలో
ఈపకా నాముక్రింద ఘోరతపస్సుచేయుచుండగా పార్వతి యేమిచేయు
చున్నదో చూతమని ప్రసన్నముగా శివుడువచ్చెనట, అందువల్ల చోరే
శ్వరుడను నాకలింగమున్నది.

తరువాత పార్వతికి ప్రత్యక్షముకాగా పార్వతి స్వామిని కుచము
లుగాజులు మూపి కౌగలించుకొనియుండగా మెచ్చి ప్రసన్నుడయినీపాపము
నశించినదని యానతిచ్చి వారిరువురు నాలీలగానే ఆ ఏకామ్రము క్రిందనే
యిట్లువెలసిరి. కాబట్టి ఈస్వామికేకామ్రేశ్వరు డనెడు పేరువచ్చినదందు
రు. ౯౦ అధ్యాయములుగలదిగాను ౧౦౦ అధ్యాయములుగలదిగాను స్థల
పురాణములు రెండున్నవి అందిట్లనే యున్నదట.

ఈస్వామివారి సేవతిమున కాగ్నేయముగా నరమైలుదూరముగా
శ్రీకామాక్షీదేవి మందిరమున్నది. దానికిని నాలుగుగొప్ప గోపురములు
న్నవి. గుడికివెనుక శుక్రవారమునాడు విశేషస్నానముసేయదగిన పంచ
తీర్థమొకటిగలదు. యింతకు శిల్పంబుగాను సుందరంబుగాను శ్రీకామా
క్షీమూర్తియున్నది, గర్భాలయసన్నిధిలో శ్రీ శంకరాచార్యులవారు స్థా
పించిన శ్రీచక్రమందే వయిదకాబార సంపూర్తిపురస్సరముగా, పూజాది
కములుజరుగుచున్నవి.

లక్ష్మీసరస్వతులు చామరములు వీచుచుండగా నడుమవిరాజిల్లు
చున్న ఏలాలకాంబయనెడు వాత్సల్యమూర్తులు యొకస్థలములోనున్నది,
లలితాసహస్రనామములయందున్న, (శ్లో॥ సచామరరమావాణీసవ్యదక్షి
ణసేవితా)యను నామమున కీమూర్తి నిదర్శనంబుగానే యున్నది. దీని
కుపష్టంబకమైన పూర్వవృత్తాంతమెట్లన్నను, పూర్వమందొకప్పుడు నా

భర్తయే యెక్కువయని గౌరియు నాభర్తయే యెక్కువయని లక్ష్మి యు సరస్వతి మధ్యవర్తినిగా వివాదపడి యువ్వరికిని దెలియని పూర్వకథ, నెవ్వరు చెప్పుదురో, వారే యెక్కువయని సమయము జేసికొని తమభర్తలనడుగగా నందు శివుండట్టి కథను చెప్పగా విని, పార్వతి సంకేత స్థలమునకు వచ్చునంతలో, నారాయణుండట్టి కథ చేయుంగయున్నను తననిర్బంధమ్మున నయిగమేయుడనెడు శివసన్నిధానవర్తిని భావించి కపటముగా హానిపలనదత్కథ నెఱింగి తనకెరింగింపగా విని లక్ష్మియును రాగా సరస్వతిసాక్షిగా గౌరియా కథ జెప్పుచుండగా లక్ష్మి యిది నేనెరుంగనాయని తదనంతర కథాపూర్తి సేయనాగె.

నిట్లు ౩౨ దినములు ముప్పది రెండు కథలు జరిగిన పైనొకనాడు గౌరి కోపించి మంచి ప్రాచీనకథ జెప్పుమని బహుగా నిర్బంధించగా శివుండు విష్ణుమాయానుగ్రహుడయిన నైగమేయుని వలన బయలూరుచుండుట దివ్యదృష్టిచే గాంచి వానిని లోకపసికయి దూరంబుగా బంచి రహస్యంబుగా మునుపటివలె నొకయపూర్వకథ గప్పి కెరింగింపగా విని యాగవుతి నెప్పటి యట్ల సంకేతస్థానంబునకు వచ్చియుండగా నారాయణునకు దత్కథ దెల్పువారు లేమింజేసి యీదినంబున నీకు పరాభవంబగునని జెప్పగా విని దిగులు పడుచు లక్ష్మియును వచ్చి కథానకీర్తిత చేతి గవురీ రాజిత యతున్యాపనియు బిమ్మట గౌరియు శివునివలన కష్టాకథా వ్యాపారమెరింగి కినిసి నయిగమేయుండును నారాయణుండును, మనుష్యులగుదురుగాకయని శపింపగా క్షేమకవియను పేర నైగిమేయుండును, వేదవ్యాసుండను పేరన నారాయణుండును మనుష్యులైరనియు క్షేమకవి మున్ను శివసన్నిధిలో వినిరి,

ఇట్లు ముప్పదిరెండు కథలను బృహత్కథామంజరియను పేరుగల గ్రంథముగా రచియించెననియు తద్గ్రంధ చమత్కారమునకులోబడి జనులు వ్యాసరూపనారాయణ కృతాష్టాదశ పురాణములయందనాదరులు కాగానతండు శ్రీకాశీ విశ్వేశ్వరునితో విన్నవించి బృహత్కథామంజరిని మణికర్ణికా

కలో బాలపఱన నియమించింది తత్ప్రతినిధిగా ముప్పదిరెండుశ్లోకములు గలమహిమ్న స్తుతిని, క్షేమకివివలన నంగీకరించి స్వీకరించెననియు, నిట్లు స్కాందపురాణమునందలి కేదారఖండమునం దుదాహరింపబడియున్నది, గావునవరాజితమైన లక్ష్మీదేవియు, సావిత్రియయ్యును, కపటముగానూర కున్నసరస్వతియు బూర్వోక్తసమయప్రకారము పార్వతికిరుగెలంకుల నిలిచిచామర హస్తులై సేవింపుచుంకుట సరిగానేయున్నది.

## శ్రీకాంచీమహాక్షేత్రము.

మరియు శ్రీకామాక్షీమందిరములో పరివారదేవత లనేకులుగల వు. గణపతి కుమారులును స్థాపకులయిన శ్రీశంకర భగవత్పాదాచార్యుల వారి విగ్రహంబును, గల్గుటయేగాక. సౌందర్యగర్వముగల లక్ష్మికి గౌరి శాపముగాగా కురూపమునొంది తొల్లింటి చక్కదనమునుగురించి చిర కాలము తపస్సుచేయుచున్న లక్ష్మికి ప్రసన్నురాలయి పార్వతివరమిచ్చె నట. అట్టిలక్ష్మికురూపమొకపార్శ్వమందున్నది.

పూర్వము శ్రీకామాక్షి నిశీథమందు యోగినీపరివృతయై గుడి నుండి బయలుదేరి కంచిలోనున్న పంచ జనులను బలవంతముగా భక్షిం పుచుండగా, కొంతకాలమునకు శ్రీ శంకరాచార్యులవారు వచ్చి వకిరాత్రి యావికారముజూచి స్వతపోమహిమచేత దేవీకళాకర్షణ మొనరించినం దున శాంతమూర్తియైన కామాక్షి సదా యీచొప్పున శాంమూర్తిగా గానే యుండునట్లుగావింపుమని కాంచీపురవాసులుచేసిన ప్రార్థనపయి ని శ్రీగురుస్వాములవారు సహస్రకలశావాహనము చేసియుండగా, కొం దరు కర్మఠులు నిరాకరింపగా వారికి విశ్వాసము గలుగుటకొక కలశము లోనున్న మంత్రపూతజల మొకమూకబాలున కభిషేకింపగా, నాతడు సకల విద్యాప్రవీణుడైయుండెను.

పిమ్మట మూకత్వముబాసి తన ణముందే మూకపంచశతియనెడు స్తవముచే శ్రీకామాక్షి దేవిని ప్రార్థించెనట ఆగ్రంధ మచ్చుపడే యు న్నది, ఆపయిని పురజనులు నమ్మినందున సహస్రకలశాభిషేకముచేసిలోం

టికశిల నావేశింపజేసి యొక శ్రీచక్రమును శ్రీకామాక్షికెదురుగా స్థాపించి యుంచిరట. ఆచక్రమందే పూజలుజరుగుచున్నవి.

మఱియొక విశేషమువింటిమి ఎట్లన్నను.

ఏలాలకాంబ భోగశక్తి, కామాక్షి వీరశక్తి. ఈమె చతుర్భుజమనోన్మణి యోగశక్తి. ఈమె ద్విభుజ, తంజావూరు మహారాజాపూర్వమందు వరదరాజోత్సవమూర్తిని కామాక్షిని జుల్ఫీన గోంపోయియుండగా వయిష్ణవులు వెంటనేపోయి యచటఁకవేషంబున ప్రవేశించి వరదరాజమూర్తిని పాడెపైనిగట్టి శవమనియేడ్చుచు కోటదాటికతోడ్చుకొనివచ్చి యంచలుమీద మరల కంచిలో వేంచేపుచేసి యప్పటియట్లపూజింపుచుండిరనియు పిమ్మట తంజావూరు మహారాజు కామాక్షినిగురించి దిట్టపరిచినందున తోడ్చుకరాశక్యముగాక భక్తులు లలితాదేవినికామాక్షిస్థానమందు ప్రతిష్ఠించిరనియు ప్రసిద్ధిగానున్నది.

ఇదిగాక అయోధ్యాది సప్తపురములలో మూడు విష్ణుస్థానములు మూడుశివస్థానములు కాంచిశివకేశవోభయస్థానమై యర్థనారీశ్వరరూపమయినందునను శివుడు కామాక్షి కళిన స్తనాంకితుడైనందునను దీని నేకాంతక్షేత్రమనియు నందురు, శ్రీకామాక్షి కాజ్ఞయముగా గర్భాలయములోనే రహస్యబిలమని యొకగుహగలదు, అది నాగలోకమువరకు నున్నదట. దానిలోక్షీరాభిషేకము చేయుచుందురు.

శ్రీ యేకామ్రేశ్వర ధ్యానశ్లోకములు,

మా॥ మూలేచూతమహీరుహస్య నివసన్మూలం జగత్సంపదామ్।
మోహాపాయరసాయనం ప్రణమతాం మూర్ధేందుచూడామణిః।
కామాక్ష్యాంకిన స్తనాంకితవపుర్వ్యాఖ్యాతకామాగమః।
కళ్యాణం సతతంకరోతుభగవాన్ కాంచీపురీనాయకః॥

శ్రీ కామాక్షి ధ్యానశ్లోకము.

మా॥ క్వణత్కాంచీదామాకరికలభకుంభ స్తనభరా।
పరిక్షీణామధ్యేపరిణత శరచ్చంద్రవదనా।

ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తాదాస్తాం నః పురమథితురాహో పురుషికా॥ ౧
అరుణాం కరుణాతరంగితాక్షీం ధృతపాశాంకుశపుష్పబాణచాపామ్।
అణిమాదిభిరావృతాం మయూఖైరహమిత్యేవ విభావయే భవానీమ్॥
చతుర్భుజే చంద్రకలావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే।
పుండ్రేక్షుచాపాంకుశపుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః॥ ౩
ఆపదకింకరీయాం స్మరణీయం చరణయుగళమంబాయాః।
తత్స్మరణం కుర్వతే బ్రహ్మాదీనపి చ కింకరాన్ కురుతే॥ ౪

అని దేవీమహిమగా చెప్పుదురు.

ఇచ్చటికి రెండుమయిళ్ళదూరమున దక్షిణంగానున్న చిన్నకంచి శ్రీవరదరాజస్వామివారు వేంచేసియున్న దేవళము, గోపురములు, ప్రాకారములు, సుందరముగా నున్నవి, బంగరుగిలుచేసినగరుడవాహనములు రెండుగజవాహనములు, హనుమద్వాహనములు, బంగరుపల్లకీ యున్నటియు, నిరువదియారుకాళ్ళ మంటపములో నున్నవి.

౧౦౮ కాళ్ళమంటపమొకటి ౧౦౦౦ కాళ్ల మంటప మొకటికలవు. అనంతసరస్సు, ఒకపుట్ట, ఒకరావిచెట్టు, గ్రంథోక్తరీతిగానున్నవి, పన్నిద్రాళ్వారు మొదలయిన వారిప్రతిమలు ప్రాకారాను న్యూలములుగా నున్నవి.

శ్రీ రామానుజాచార్యులవారు, పన్నిద్రాళ్వారు, నొకభాగమందున్నచిన్నమంటప తుల్యమందిరములో ప్రతిష్ఠింపబడియుండిరి, మరియొకదరి బ్రహ్మాదిపరివారదేవతలుండిరి, బ్రహ్మదేవుడు చిత్తస్థైర్యమునుగురించి ఈ సత్యవ్రతక్షేత్రమం దశ్వమేధయాగము సేయుచుండగా వపాభక్షణముసేయుచు నుదయించిన వరములిచ్చెగనుక యీస్వామికి వరదరాజస్వామియనెడు పేరువచ్చినది,

ఇది కరిగిరినిగొట్టి సమీకరించి కట్టినందున కించ దున్నతముగా నున్నది, వేరొకమందిరములో పెరుందేవితాయారనెడు పేరుగలిగి యమ్మవారు ప్రకాశించుచున్నారు.

—( ధ్యానము. )—

శ్లో॥ వపాపరిమళోల్లాస వాసితాధరపల్లవమ్।
ముఖం వరదరాజస్య ముగ్ధస్మిత ముపాస్మహే॥ ౧

శ్లో। సత్యవ్రతే ద్విరదభూధ్రపతి కాంచికాయాం।
బ్రహ్మాశ్వమేధః చితి ఉత్తర వేదికాయామ్। ౨

శ్లో। ఆవిర్బభూవ జగదతి ప్రశమాతిశయ హరిర్యః।
పూర్వామధ్య తమహం శరణం ప్రపద్యే॥ ౩

శ్రీ వరదరాజస్వామివారియావిర్భావమునుగురించినపురాణగాథ యెట్లన్నను —

పూర్వమందు లక్ష్మీభక్తులయినకొందరు మునులును, సరస్వతీభక్తులయిన కొందరుమునులును, తమతమయుపాస్యదేవతలయొక్క యుత్కర్షాపకర్షములనుగురించి, వివాదపడి, తెగవుదీర్చికొనుటకై, సత్యలోకమందున్న బ్రహ్మదేవునిసన్నిధికిబోయి సభికులతోడను వచ్చినకారణంబెఱింగింపగావిని వారేమియుననెఱుగక యూరకున్నంజూచి వారిప్రతివాదులునన్నదుగకయున్నను వారింగోపిలిచి బ్రహ్మయోమునులారా సకలజగజ్జననీజనకులయి ప్రకృతిపురుషులయినలచ్చిమి నారాయణులకన్నసధికముగల స్త్రీపురుషజీవులు వేరుగావున, లచ్చిమికన్న సరస్వతియధికురాలెట్లగునని యనిన, సరస్వతి చిన్నబోయి నదులలోనయినను నాకు శ్రేష్ఠత్వము గలిగింపుమని ప్రార్థింపగా, విష్ణుపాదోద్భవయయిన విశ్వపావనియయినగంగానదికన్న శ్రేష్ఠములయిన నదులు లేనేలేవని బ్రహ్మయనగా, విని యవమానంబునకు సిగ్గుపడిదిగ్గునలేచి సరస్వతీనదియందంతర్ధానమునొందె, నంతటయి గొంతకాలమునకు వాణీకాంతుండు చంచలస్వాంతుండయివిన్ననయియున్న సమయంబున నోవిరించీ హరినిగురించి సహస్రాశ్వమేధ యాగంబులొనరించినంగాని, నీకీచిత్తచాంచల్యంబు సాకల్యంబునం బోనేరదనియు, నేనిన్నిజన్మంబులొనరింపగలవాడనని విచారింపక సత్యవ్రతక్షేత్రంబునకరిగి యందొకయశ్వమేధ యాగంబునాసియోగంబున గావించితివేని సహస్రాశ్వమేధ యాగఫలంబు సులభంబుగాసంభవించునని, గంభీరస్వరంబున నశరీరవాణి వాణీధవునకు వినిపించిన విని

డెందంబునం దమందానందంబు నొంది సత్య సంధుండయిన సత్య
లోకేశ్వరుండు సత్యవ్రత క్షేత్రంబునకు వచ్చి యచ్చటికి విశ్వక
ర్మను రావించి యరణ్యచ్ఛేదన పూర్వకంబుగా హస్తిగిరిలంబంతయు స
మీకరింపించి యందు సకలవస్తుసంపన్నంబయిన యొకపురంబు నిర్మా
పించి యింద్రాదిబృందారకులు శేషాద్యశేష నాగలోకవాసులు మానవు
లు దానవులు, వశిష్ఠాది మునిశ్రేష్ఠులు, మొదలుగాఁగల సజ్జనులను బిలిపిం
చి వారికిఁదగిన యుపచారంబులు గావించుటకు బ్రాహ్మణులను నియమిం
చి సుముహూర్తంబున యాగసంకల్పం బొనరించునప్పుడు నిజమానసపు
త్రుండయిన వసిష్ఠమహామునిం బిల్చెను,

అంతనాధర్మపత్నియైన సరస్వతి యొకానొక కారణంబున నల్గి,
సరస్వతీనదిలో నంతర్భవించియున్నది గావున నీవిప్పుడచని యథోచితసం
భాషణంబుల బ్రసన్నంగావించుకొని తోడ్కొనిరమ్మనుడు. నతండట్లనేచ
నియంత ప్రార్థించినను వినక పూర్వోక్త స్వపరాభవంబు గ్రహించి, సరస్వతి
రానుపొమ్మనిన, మరలవచ్చి వసిష్ఠుండావృత్తాంతంబు పరమేష్ఠి కెరింగించిన
నతండు భర్తనతిక్రమించినభార్యను విడుచుట పరమధర్మంబనియు సూ
ర్యపుత్రియైన సావిత్రిని ధర్మపత్నిగా నంగీకరించి శ్రద్ధాదులైనయితరభార్య
లతోడంగూడి, సంకల్పించి యాగంబుగావింపు మనెను.

తర్వాత నంగిరసుండు మొదలయినసభికులు విన్నవించిన చందం
బున హోమోత్సర్జన పూర్వకంబుగా, భగవత్ప్రీతికరంబుగా యాగంబు
గావింపుచుండంజూచి యింద్రాదిదేవతలు లేచి యోపితామహా మాపేర
నుగ్గడింపుచునే హవిర్భాగంబులు మాకుదొరకుచున్నవి, ధర్మంబుదప్పు
టన్యాయమాయనివిన్నవింపం బ్రసన్నవదనుండయియున్నలువయిట్లనియె.

ఓసురలారా స్వర్గాదిఫలార్థులౌనంగుమాహవిర్భాగంబు మిమ్ముం
జెందునే కాని కేవలమోక్షార్థులయినయస్మదాదులొనంగు హవిర్భాగంబు
లుభగవదర్పితంబులగుటం జేసి, మిమ్ముజెందవని చెప్పుటయే కాక, కర్మజ్ఞా
నంబుల తారతమ్యంబును, పుణ్యాపుణ్యస్వరూపంబును, తత్ఫలభూతంబులై
యునస్వర్గనరకంబుల తెరంగును భక్తిమార్గంబున సవిస్తరంబుగా నా
తెలింగించి యప్పటియట్ల జన్నంబొనరింపుచుండ,

నది యుల్లంఘించ మున్ను పరిచారకులుగా నియమింపఁబడిన బ్రాహ్మ
ణులు విశేషార్థ ప్రాశ్యకంబుగా గీర్వాణుల నారాధింపుచుం బూర్వాను
వర్తియగు యెడ ననాదరంబుగా నుండుటచే గల్గిన యవమానంబునకు సహిం
పకసిలింపవయిరులు మునివేషంబున నొన్నటి నదితీరంబునకే తోరంబుగా
గయివారంబుసేయం జూచి, ప్రసన్నయైన సరస్వతీదేవి మీఁగువచ్చిన కా
ర్యం బెఱింగింపుఁడనవిని యుమ్మామి విప్రులు విచారించి సుభత్రిత్రతగులాటక
త్తైలతోఁ గూడి యశ్వమేధంబు గావింపుచుండఁగ మేము మీపక్షంబుగ వారిం
చినం గినిసి బ్రహ్మకుఁలుం దానును మమ్ము నిరసించి యుచ్చాటనంబుగా
వించిరి గావున సర్వమ్ము దంతంబంతయు విన్నవింపవచ్చితిమి. తగిన ప్రతీకా
రంబు శక్తిగలదేని చేసికొనుము. నూవచ్చినకార్యంబిదియని యుపా
యంబునం బురికొల్పి సజనివాసంబులకు జనిరి.

సరస్వతి నత్యంతకుపితయై సహ్యాగిరి శిఖరం బెక్కియందుండి నధిమా
నంబున ప్రళయకాలసముద్రంబు వడువున ఘూర్ణిల్లుచు సత్యవ్రతక్షే
త్రాభిముఖంబుగ. ఘోరాకారంబున ప్రవహింపుచువచ్చుచుండ యజమా
నుండగు చతురాననుండుదక్కఁ దక్కిన బ్రహ్మాది సకలజనంబులు నందం
దడాగియుండిరి. పుండరీకాక్షుండు పుండరీకాక్షేశ్వరుండై యుండె.

అంతలో భీకరాంబకుండు దిగంబరుండై యథోక్తకారి నామంబున
దత్ప్రవాహంబున కడ్డంబుగ బవ్వళించియుండె. సరస్వతి సిగ్గునఁ దిల్చి ౧
ప్రభ. ౨ కంప, ౩ పంప, ౪ అసమంజస. ౫ శుక్తి, ౬ కనక, ౭ చం
డవేగ యనునామములచే సప్తప్రవాహములయి యాయథోక్తాదిసన్ని
ధిరుగొలంబులం బ్రవహించె.

మొదట తిమకంబున వేగంబుగ వచ్చినది వేగవతి యనం బ్రసిద్ధి
కెక్కె, నంతలో బరమేష్ఠి మరల వసిష్ఠుం బంపి భగవతీ ప్రతిపాత్రంబయిన
యూపిత్యాగ్రిక్షేత్రంబున వేగవతియను పేరుగల నీవు సకల నదీ శ్రేష్ఠవు
గున్నట్లు వరం బిచ్చితినని చెప్పించి రప్పించిన నప్పటి కలవెలంది యా
మందించివచ్చె. నిట్లువచ్చిన యచ్చలాక్షిం గూడి యచ్యుతముఖుండు
నాఁగ శేషంబు నిర్వర్తించి వసాహోమము సేయుచుండ వసాభక్షణంబు

చేయుచు, శ్రీమన్నారాయణుండవ పావరిమళముతో పరిమళించుచున్న యధరపల్లవముతోడ బ్రత్యక్షమై యాసరస్వతీదేవితోడ బ్రహ్మకును, ఆకామాక్షీదేవితోడ యేకాంబరేశ్వరునకును కోరినవరములిచ్చి తాను వరదరాజమూర్తియై పెరుందేవితాయారుతోడ అప్పుడు మొదలుకొని యిప్పటివఱకును భక్తులకు తనయమందానందప్రదదర్శన దర్శనము కలుగ జేయుటకై కాంచీపట్టణమున నిత్యోత్సవపక్షోత్స వసంతోత్సవమహోత్సవాదులలో తిరుచ్చిల్లకి ఆళుంపల్లకి ఆళివాహన, హంసవాహన, అశ్వవాహన, గరుడవాహనములతోను మణిచంద్రప్రభ సూర్యప్రభలతోను తోరణాలవట్ట ఛత్రచామరాదులతోనుగూడ తిరువీధులు, మాడవీధులు, మండపాలు, క్రీడావనములు మొదలైనవానియందు ఢక్కాడమరు డిండిమ పటహాది నానావిధనాగసర మేళతాళములువాయింప, కాపుగొలుసు, గెజ్జగొలుసు, అందెలగొలుసు మొదలగుసొగసుగల సొమ్ముల తోడ రూపరేఖానుగుణగణికలు శ్రోతృజన మనోనురాగజనకములైన రాగవిశేషము లాలాపింప, ముందునువెనుకను అధ్యాపకులు గోష్ఠితో అనుసంధించెడి ద్రావిడవేద సామవేదములుఘోషింప, నేత్రానంద శ్రోత్రానందములు గలుగజేయు భగవన్నామగుణానుభవ స్తోత్రములతోడ భాగవత భజనలు ప్రకర్షంబుగ ప్రవహింపంగను వేంచేయుచు సామాన్యులను సైతము పవిత్రజన్యులనుగ జేయుటకునై చిత్రవిచిత్రముగ సేవసాయుంచుచుండును.

ఈకాంచీపట్టణము అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా, పురీద్వారవతీ, "చైవసప్తైతా మోక్షదాయికాః" అని యీయేడుపట్టణములును ముక్తిప్రదములైయైనను, యీకాంచీపట్టణము యీప్రాంతమున భుక్తిముక్త్యుభయప్రదాయకమని శిష్టులు వచియించెదరు.

ఇందు మహాదేవ, మహావిష్ణు, దేవోభయ దేవాలయములును, తక్కిన యాయాయి ముక్తిప్రదపట్టణములైయైనను, మూడు అయోధ్యా, మధురా, ద్వారవతీ, పట్టణములు ప్రసిద్ధములైన విష్ణుదేవాలయములతోను మాయావంతికా కాశీపట్టణము మూడును ప్రసిద్ధములైన శివ దేవాలయములతోను నుండునవి అనిప్రశస్తము.

ఈపట్టణము వగాకాశబిలముతోను తత్స్వరూపిణియైన కామాక్షీదేవిదివ్యాలయముతోనుఏకాంబరనాథుడనెడి పరమశివమూర్తిదివ్యా

లయముతోను నారాయణమూర్తియైన వరదరాజస్వామి పుణ్యకోటివి
మానముతోను, మఱియు ౧౮ విష్ణ్వాలయములతోను ౧౦౮ శివాలయ
ములతోను ప్రళయమునను నాశము నొందని శక్త్యాలయములతోను విఘ్నే
శ్వర కుమారస్వామి శాస్త్ర్యాద్యాలయములతోను కాంచీ మహానదుల
తోను ౨౧ మహాతీర్థములతోను మఱియు ననేక దేవమునులచేత యే
ర్పఱుపబడిన తీర్థభేదములతోను ప్రసిద్ధమైయున్నది.

ఇదిగాక యీ కాంచీపురాకాశశిలముతో దివ్యకాంచనవృత
మును, దానినాయుదిక్కుల మెట్లు ప్రపన్నవృతమును, ఆమూలమున జ్యో
తిర్లింగమును, ఆకాశమునందే యుదిక్కుల శ్రీమన్నారాయణమూర్తి
కి నిత్యనివాసమైన దివ్యక్షేత్రము నొక్కటిగనుండెను.

అదిగాక ఆజగత్కారణమూర్తియైన శ్రీమన్నారాయణమూర్తి
ఆపరాకాశ శిలమునొద్ద తాను నారాయణ, సంకర్షణ, వాసుదేవ, ప్ర
ద్యుమ్న, అనిరుద్ధులు అను అయిదురూపములుధరియించి తమతమపేరి
ట తీర్థంబొక్కొక్కటి నిర్మించి ఆయైదుతీర్థములు నొక్కటేసరోవర
ముగా యేర్పరచినందున అది పంచతీర్థమనఁబడియె.

ఇట్టి యీక్షేత్రము భూలోక, భువర్లోక, స్వర్లోకములు మూటి
లోను శ్రేష్ఠముగుటవలన భువనత్రయసారపురమనియు, అచట తపముచే
యువారికి సకలాష్టసిద్ధులును గలుగుటవలన సర్వసిద్ధికరపురమనియు, బ్ర
హ్మ, విష్ణు, మహేశ్వరులు వాసముచేయుటవలన త్రిమూర్త్యావాసపుర
మనియు పరాశక్తి కన్యారూపముదాల్చి అంధకాసురుని సంహరించి ఈ
పురమును రక్షించుచున్నందున కన్యారక్షపురమనియు బ్రహ్మచేత
పూజింపబడినందున బ్రహ్మపురమనియు, అపాయములేక యుండున
దిగనుక సదాపాయస్థితపురమనియు, అచట తపముచేయువారికి సకలసి
ద్ధులును గలుగుటవలన తపస్సిద్ధిపురమనియు, ప్రళయకాలమందును నా
శములేకయుండునది గనుక ప్రళయజిత్పురమనియు, ఇంక బ్రహ్మ, విష్ణు
మహేశ్వరులు నివసించియుండుటవలన బ్రహ్మపురము, విష్ణుపురము, శై
వపురమనియు ఆపరాశక్తి సింహాసనస్థానముగా నుండుటవలన శక్తిపురమ
నియు ప్రసిద్ధవడియున్న పేళ్లతోఁడగూడిన పుణ్యక్షేత్రములు.

శ్రీకాంచీమహాక్షేత్రము—సంపూర్ణము.

—(*)—

యిచ్చుచికివచ్చి స్వామిప్రసాదమును భక్షించి ఘృతపానముచేసి పోవు
చుండును. పక్షి దర్శనార్థమై పోవువారు శంఖతీర్థములో స్నానము చేసుకొని
ఫలపుష్పాదులుతీసుకొని పుదయము కొండయెక్కి స్వామిపూజ గావించి
కనిపెట్టియుండగా పక్షిపండారంవచ్చును. పదిఅణాలు మొదలు పదిరూ
పాయలవరకును శక్త్యానుసారంయిచ్చెదరు ఆపండారం స్నానముజేసి శ
ర్కరతో పొంగలివండి ఘృతపాత్ర సహితంబుగా మంటపమునకువచ్చి
అచ్చట ప్రజలనుగూర్చుండ నియమించి తానుసాష్టాంగ నమస్కారపూ
ర్వకంబుగా పీటమీదగూర్చుండి జపించుచుండగా తెల్లనిపక్షులు రెండు
నువచ్చును. వెంటనే పొంగలి ఘృతముయిచ్చిన నవిభక్షించి తృప్తినొం
ది మరలపోవును. తత్ప్రసాదమని సర్కరాదులిచ్చును.

వేదగిరియందున్న రుద్రకోటీశ్వర క్షేత్రము.

పన్నెండేండ్లకొకసారి యీస్థానాధికారికి స్వప్నగోచరమై మ
రునాడపుడు నిరీక్షించుచుండగా సుశబ్దంబగును. వెంటనే శంఖతీర్థము
లోమునిగి వెతుకగా మహాశంఖ మొకటిదొరకును నదియు బంగరుతొట్ల
లోనునిచి సోత్సవంబుగాగొనితెచ్చి వేదగిరిమీద వేంచేసియున్న శ్రీ వే
దగిరీశ్వరస్వామి సన్నిధిలోనునిచి పూజింపుచుందురు. యిన్నిట్లుదయిం
చిన శంఖములనేకములున్నవి. యిందునుంచి యీతీర్థమునకు శంఖతీ
ర్థమని యందరు వింటిమి.

పన్నెండేండ్ల కొకసారి ఫాల్గుణమాసములో కొకనాడు అకస్మా
త్తుగానురిమి యుల్కాప్రాయముగా సుశబ్దముగా తేజఃపిండము (పిడుగు)
ధ్వజస్తంభమునకుదక్షిణపార్శ్వమందుపడి గుడిలోనికిపోయి స్వామికిప్ర
దక్షిణంబుగా మరల ధ్వజస్తంభమున్నచోటికేవచ్చి యంతర్ధానమగుట
కలదనియు రేఖాచిహ్నమప్పుడు గనంబడుననియు దీనినే యింద్రపూజ
యని చెప్పుదురనియు పిడుగుబడినప్పుడు గుడిలోనున్న యర్చకులు మూ
ర్ఛనొంది సీతలోపచారములవల్ల తెప్పిర్లిదరనియు యెన్నడు యెవరికి
కి నపాయములేదనియు వింటిమి. స్థళపురాణమునందు దీనిమహిమ పె
క్కుతెరంగుల వర్ణింపబడినది.

ఒకశెట్టికూతురైన చొక్కమ్మయనుకన్య మిక్కిలిభక్తురాలై త
పస్సుచేసి ప్రసన్నులైనస్వామినే భర్తనుగావరించినందున తదిష్టప్రకా
రము స్వామిజరిగించగా త్రిపురసుందరియను నమ్మవారి కసూయకొల

ములుదయించి వేదగిరివిడచి దిగువనేనివసించగా శివుండమ్మవారికిసహాయముగా నొకభక్తునిపంపగా నతండామెతో నచ్చటికివచ్చి తత్పార్శ్వమందుండెననియు పదిదినములకొకసారి కొండపైనుండి స్వామివారమ్మవారికడకు వచ్చుచుందురనియు దిగువతిరుపతిలోనున్న పెద్దగుడిలో భక్తవత్సలేశ్వరుడనుపేర వెంచేసియుండెననియు చొక్కమ్మ చొక్కనాయకియనుపేరు గలిగియుండెననియు వింటిమి.

ప్రతిచైత్రమాసములో బ్రహ్మోత్సవంబున యావన్మూర్తులను వేదగిరికిప్రదక్షిణంబుగా తిరుగించు తేగించెదరు ఉత్సవముచూడ వేడుకగానుండెను. యీకొండమీద సజీవినిమొకటైన మహామధములున్నవియనియు వర్షాకాలములో వాటిమొదటినుండు మన్ను నీటితోకరిగివచ్చుననియు దీనినిధరించువారికి బ్రహ్మహత్యాదిపాపములున్ను కుష్ఠాదిరోగములున్ను పోవుననియు కొందరనిరి. యీమట్టి సంగ్రహించి తెచ్చుట శిష్టాచారమైయున్నది.

పక్షితీర్థము రుద్రకోటీశ్వర క్షేత్రము
సంపూర్ణము.

---

# శ్రీ చిదంబర మహాక్షేత్రము.





పుండరీకపురమనియు, తిల్వవనమనియు, వ్యాఘ్రపురమనియు, అభ్రిసభయనియు ఇత్యాదినామంబులుగల ఈచిదంబరక్షేత్రము విరాట్పురుషునకు దమురాకాశాఖ్య హృదయస్థానమని యుపనిషత్ప్రసిద్ధమైనది.

శ్లో. శ్రీపర్వతంశిరస్థానే వేదారంతు లలాటకే
అవిముక్తం భ్రువోర్మధ్యే హృదయేతు చిదంబరం.

మిత్యాది శ్రుత్యుక్తరీతిగా మహాయోగులు ధ్యానముచేయవలయునని యోగశాస్త్రరహస్యముకలదు. ఈక్షేత్రమహాత్మ్యము బహుపురాణములలోనున్నది. ౪-గోపురములు ౫-ప్రాకారములుగలవు. ప్రథమప్రాకారమనగా గర్భప్రాకారములో జ్ఞానసభ, హేమసభ యని నామాంతరములుగల చిత్సభయొకటిగలదు దీనివిశేషం బెట్లనను.

౧. పంచాశద్వర్ణములు అస్థిభాగములుగా సముగూన చేర్చబడినవి.
౨. చతుర్వేదములను నాలుగుపెద్దస్తంభములుగా నిల్పిరి.
౩. షట్శాస్త్రములను నారుచిన్నస్తంభములుగా నుంచిరి.
౪. యిరువదియెనిమిది శివాగమములు క్రిందిపీఠముగా వేయబడినవి.
౫. తొంబదియారుతత్వములను గవాక్షులుగా నుంచబడినవి.
౬. శ్రీనిశిపంచాక్షరీ మహామంత్రము సన్నిధియందు వైదుమెట్లుగానుంచిరి.
౭. చతుష్షష్టికళలనగా అరువదినాలుగువిద్యలు కమ్ములుగా నమర్చబడెను.
౮. పదునాలుగులోకములుగా విమానపలక లుంచబడెను.
౯. నవశక్తులతొమ్మిదికలశములుగ విమానోపరిభాగ మందుంచబడినవి.
౧౦. డెబ్బదిరెండువేలనాడులు పోదుబిళ్ళలకు మేకులుగ తాచబడినవి.

ఇట్టి యీచిత్సభలో శ్రీచిదంబర పరమానందతాండవమూర్తి దక్షిణాభిముఖముగా,

శ్లో. ప్రథమంవహ్నిహస్తంచ ద్వితీయంచరణంతథా
తృతీయంలంబహస్తంచ చతుర్థంపన్నగంస్మరేత్
అభయంపంచమంవిద్ధి తాండవంభావయేత్సదా.

అనునట్లువేంచేసి విరాజమానమగుచుండె. శ్రీశివకామసుందరియను యమ్మవారుదక్షిణాభిముఖముగానేయుండి శివతాండవమును క్రేగంటజూచుచున్నట్లున్నారు. యీ యమ్మవారినమ్మూర్తి సువర్ణ మయము, యీమెకుతూర్పుగా స్వర్ణభైరవుడున్నాడు. ఏకమందిరములో వీరంద

రుండిరి. చిదంబర మూలస్థానమునకు పడమరగా నుత్తరముఖమై పుష్కరిణి లోగోడమీద చిదంబరచక్రము మొదలైన సువర్ణమయములైన చిదంబరరహస్యములున్నవి. స్వామిసన్నిధిలో ప్రాఙ్ముఖముగా తిల్లగోవిందరాజస్వామివారును పుండరీకవల్లియను పేరుగల లక్ష్మీదేవియును నున్నారు యిదిచిత్సభయందురు దీనిపైని సువర్ణమయములైన కోడుబిళ్ళలనగా పెంకులుస్థాపించిన విమానము, గృహాకారముగానున్నది. యీ యగమందు తామ్రమాకారముగా గరుడని బడుచున్న దంట్లురు. కొంత భాగమునకు తో యిచూచినతే స్వామికిసరిగా మీదను సువర్ణమయములయిన కోడు బిళ్ళలు కనంబడును.

యీస్వామి తుల్యముగానే అనాదికాలముబట్టి మూర్తీభవించిన స్ఫటికలింగంబును, మరకతమణిమయమైన యానంద నటేశమూర్తియును కనకసభయనెడు సన్నిధిమంటపములో నిత్యమును షట్కాలములయందు యథావిధిగా వ్యాఘ్రపాదపతంజలి నిర్దిష్టసూత్రప్రకారముగ నారాధింపబడుచున్నవి. యీ చిదంబర సభానాయక మూలవిగ్రహమునకు సంవత్సరములో ఆరుమార్లు జ్యేష్ఠాభిషేకము గనుక శ్రీచిత్సభలో నుండి కనకసభమునకు కమ్మవారితో స్వామివారిని వేంచేయించి యభిషేకించుకాలములు.

౧. చైత్రమాసములో శ్రవణనక్షత్రమందున

౨. శ్రావణ శు ౧౪ కి

3. భాద్రపద శు ౧౪ కి

౪. మాఘ శు ౧౪ కి

౫. జ్యేష్ఠమాసములో బ్రహ్మోత్సవమందున

౬. మార్గశీర్షమాసములో బ్రహ్మోత్సవమునందున

౧. చిత్సభ } శ్రీచిదంబరతాండవమూర్తియు శ్రీకామాక్షీసుందరియమ్మ
౨. కనకసభ } వారుండునవి.

3. రాజసభ వేయిగాళ్ళమంటపములోనే యున్నది.

౪. నర్తనసభ ఊర్ధ్వతాండవేశ్వరులున్నారు.

౫. దేవసభ సోమాస్కందమూర్తి, శివానందనాయకి, సుబ్రహ్మణ్యస్వామి, వినాయకుడు, భిక్షాటనమూర్తి, చంపకేశ్వరుడు యీ మొదలగు యుత్సవమూర్తులున్నారు.

ఇచ్చటి తీర్థములు.

౧ శివగంగాతీర్థము. ౨ పరమానందతీర్థము. 3 గుహ్యతీర్థము. ౪ వ్యాఘ్రతీర్థము. ౫ యవ్వనతీర్థము ౬ నాగతీర్థము ౭ శివతీర్థము. ౮ క్షీరాబ్ధితీర్థము. ౯ బ్రహ్మతీర్థము.

శ్లో. కైలాసశైలభువనే త్రిజగజ్జనిత్రీం గౌరీంనివేశ్యకనకా
చితరత్నపీఠే। నృత్యంవిధాతుమభివాంఛతిశూలపా
ణౌ దేవాఃప్రదోషసమయేసు భజంతిసర్వే. ౧

శ్లో. మహేశంసురేశం సురారాతినాశం విభువిశ్వనాథం
విభూత్యంగభూషమ్। విరూపాక్షమింద్వర్క వహ్నిత్రి
నేత్రం సదానందమీడే ప్రభుపంచవక్త్రమ్. ౨

| | |
|---|---|
| ౧ కంచిలో యేకాంబ్రస్వామివారు | పృథ్వీలింగము |
| ౨ జంబుకేశ్వరములో జంబుకేశ్వరస్వామివారు | అబ్లింగము |
| 3 తిరుణామలలో యరుణాచలేశ్వరస్వామివారు | తేజోలింగము |
| ౪ కాళహస్తిలోని కాళహస్తీశ్వరస్వామివారు | వాయులింగము |
| ౫ చిదంబరములోని చిదంబరేశ్వరస్వామివారు | ఆకాశలింగము |

ఇటుల క్షేత్రమహాత్మ్యములయందలి గ్రంథములలో నుదహరింపబడియున్నది.

చిదంబరక్షేత్రమహిమ—సంపూర్ణము.

## శియ్యాళి క్షేత్రము.





శ్రీస్వామి పేరు బ్రహ్మపురీశ్వరుడు, అమ్మవారి పేరు త్రిపురసుంద రి; వీరు ప్రత్యేకాలయములలో నున్నారు. గుడివద్దనే బ్రహ్మతీర్థమున్నది గుడిచుట్టు ననేకదేవతామందిరములు లింగములు, భక్తవిగ్రహశ్రేణులు నుగలవు. పుష్పఫలాదులు గుడిలో నేయమ్ముదురు. స్వామివారిగుడికి ప్ర దక్షిణముగా నుత్తరపార్శ్వమునకు రాగా అచ్చటనున్న పెద్దగుడి మెట్ల వెంబడిని ప్రాగ్దక్షిణముగా యెక్కిపోగా ప్రాఙ్ముఖముగా మహోన్నత ములై యుమామహేశ్వరవిగ్రహములు రెండు తత్పరివార దేవతాస హితములై యున్నవి. అచ్చటినుండి పశ్చిమాభిముఖముగా మరికొన్ని మెట్లు యెక్కిపోగా, దక్షిణాభిముఖముగా వేంచేసియున్న (చట) శరనా థుడనెడుదేవుని దర్శనమగును. శరభావతారము యొక్క మహోగ్రతను సహింపజాలక బ్రహ్మాదిదేవతలు ప్రార్థింపగా దిగంబరముగా శాంతమైని ల్చిన శరభవిగ్రహమిదేనని స్థలజ్ఞులనిరి. కాలభైరవుడని కొందరనిరి. ఈ యనకు ప్రతి శుక్రవారము నాడు పునుగు, జవ్వాదితో నభిషేకించి పూ జింతురు. అలంకారములు, వాహనములు, వుత్సవములు, భోగరాగము లు అనుకూలముగానున్నది.

జగన్నాథమన్నాథగారీసనాథ ప్రసన్నానుకంపిన్వి పన్నార్తిహారిన్ మహాస్తోమమూర్తే నమస్తేత్రిబంధో నమస్తే నమస్తే పునస్తే నమోఽస్తు.

నివాసః కైలాసే సధిశతముఖాద్యాః స్తుతికరాః కుటుంబం త్రైలో క్యం కృతకరపుటః సిద్ధినికరః - మహేశః ప్రాణేస్త దవనిధరాధీశతనయే శే సౌభాగ్యస్య క్వచిదపి మనాగస్తి తులనా.

శియ్యాళిక్షేత్రము — సంపూర్ణము.

---



## వైద్యనాథ క్షేత్రము.

శ్రీవైద్యనాథేశ్వరస్వామివారికి మూడుప్రాకారములు, నాలుగు గోపురములుకలవు. రెండుప్రాకారములలో చుట్టును మందిరములున్నవి. స్వామివారు పశ్చిమాభిముఖముగాను, దక్షిణాభిముఖముగా సన్నిధి అమ్మవారు బాలాంబికయుండెను. దండనాథ ధృవమూర్తియున్నది దాని కెదురుగ శ్రీరాములవారు జటాయువును దహనముచేసిన గుండమున్నది. సిద్ధామృతతీర్థము కలదు కుమారస్వామివారికి కార్తీకమాసములో కృత్తికానక్షత్రమందు విశేషోత్సవము చేయుచుందురు. అనేకులువచ్చి సేవించి అభీష్ట సిద్ధినొందుచుందురు.

శ్లో. బాలేశ వైద్యనాథేశ మహాపాపహరేతిచ
పఠేన్నామత్రయంనిత్యం భవరోగనివారణమ్

అని స్వామివారిమహిమను దెల్పుదురు.

ప్రణమామ్యథయామిచాపరం శరణం కంకృపణాభయప్రదమ్
విరహోవవిభో ప్రియామయంపరి పశ్యామిభవన్మయంజగత్.
ఆపత్సుమగ్నః స్మరణంత్వదీయం కరోమిదుర్గే కరుణార్ణవేశి
నైతచ్ఛఠత్వంమమభావయేథాః క్షుధాతృషార్తా జననీంస్మరంతి.

వైద్యనాథక్షేత్రము—సంపూర్ణము.



## మయూర క్షేత్రము.








కావేరీశాఖకు దక్షిణభాగమందు మాయూరేశ్వర నామముగల స్వయంవ్యక్త శివస్థలమున్నది. అమ్మవారు, అభయాంబిక, గణపతి, కుమారస్వామి, సభాపతి మొదలైన యనేక దేవతలయొక్క మందిరములున్నవి. అనుకూలముగానే పూజాదులు జరుగుచున్నవి.

హరివిరించిసురాధిపపూజితం యమనుజనశుభనేశనమస్కృతమ్
త్రినయనంభుజగప్రితయాధిపం భజత రేమనుజాగిరిజాపతిమ్.

శరణంతరుణేందుశేఖరః శరణం మే గిరిరాజకన్యకా
శరణంపునరేవతావుభౌ శరణంనాన్యదుపైమిదైవతమ్.

విధాత్రీధర్మాణాం త్వమసి సకలామ్నాయజననీ త్వమర్థానాం మూలధనదన మనీయాంఘ్రికమలే త్వమాదిః కామానాంజననికృత కందర్పవిజయే సతాం ముక్తేర్బీజంత్వమసి పరమబ్రహ్మమహిషీ.

కావేరీశాఖ కుత్తరభాగమునందున్న తిరువందళూరిలో శ్రీపరిమళ రంగనాయకులవారి మందిరమున్నది. స్వామివారికి నాలుగుభుజములున్నవి. శిరోభాగమందు, సూర్యుడు-నాభియందు, బ్రహ్మ-పాదములయందు, చంద్రుడుయుండిరి. శ్రీదేవి, భూదేవి, గంగా, కావేరీవిగ్రహములు సుందరముగానేయున్నవి. పూజాదు లనుకూలముగానే జరుగుచున్నవి.

ఉ. జనములభక్తహృత్సరసిజాతదివాకరపుండరీకలో
చనహరినీలదేహదితిజప్రకరాచలదేవకాం
చనశుభవక్త్రభావభవ శాసనమిత్రమహాహితల్పచం
దనకలితాంగభూరిభవ తాపనివారక రంగనాయకా.

మాలిని. జలరుహనిభపాదా సత్యమార్గానుమోదా
జలదనిభశరీరా శక్రవైరిప్రహారా
సలలితశుభభావా సర్వవంద్యప్రభావా
కలితదరరథాంగా కౌస్తుభాపీనరంగా.

గ్రామము, కోనేరు, సత్రము, అనుకూలముగానుండెను.

మాయూరక్షేత్రము — సంపూర్ణము.

—(*)—

## రాజమన్నారుగుడియను మహాక్షేత్రము



నేడామంగళపు స్టేషనుకు దక్షిణముగ ౮ మైళ్ళదూరములో చంపకారణ్యమనియు, దక్షిణద్వారకయనియు, ప్రసిద్ధికెక్కిన రాజమన్నారుగుడియను క్షేత్రము ౨-3 మైళ్ళనిడివిగలిగి బ్రాహ్మణ, వైష్ణవ, బృందభూయిష్ఠమైన గ్రామమున్నది.

౧ హరిద్రాతీర్థము
౨ శంఖతీర్థము
3 చక్రతీర్థము
౪ క్షీరాబ్ధితీర్థము
౫ గోపీనాథతీర్థము

ఈ 9_తీర్థములలో హరిద్రాతీర్థముముఖ్యము, చోళదేశే, చంపకారణ్యక్షేత్రే, దక్షిణద్వారకాయాం, శ్రీరుక్మిణీసత్యభామా హేమాబ్జనాయికాసమేత శ్రీరాజగోపాలస్వామిసన్నిధౌ, హరిద్రాతటినీస్నానమహంకరిష్యే. అని యిచ్చట సంకల్పము చెప్పుదురు.

౬. అగ్నితీర్థము
౭. లక్ష్మీతీర్థము
౮. కృష్ణతీర్థము
౯. గజేంద్రమోక్షతీర్థము

ఈమహాక్షేత్రములో గొప్ప గోపురములు గలసుందరమైన దేవతామందిరముకలదు. అందులో మూలమూర్తులుగా శ్రీకరవాసుదేవులును, ఉత్సవులుగా రాజమన్నారుస్వామివారును, చంపకలక్ష్మియనునమ్మవారును, శేష పటక్షత్రశాయియైన సంతానగోపాలమూర్తియును, రజితధేనువును, పంచభైరవులును, వేంచేసియుండుటయేగాక, యాళ్వారాదులునుంగలరు. అమ్మవారిమందిరము దీనికి దక్షిణముగానున్నది. తక్కినవారు స్వామిసన్నిధిలోనేయున్నారు స్వామికిరుప్రక్కలను శ్రీదేవియు, భూదేవియునుండిరి. మంచికలువగల యలంకారములున్నవి.

పూర్వమందు గోబిలమహర్షి చిరకాలము శ్రీకృష్ణునిగురించియీ చంపకారణ్యమందు తపంబుసేయగ శ్రీకృష్ణుండు ప్రత్యక్షమై నీకేమికావలయునో వేడుమనిన నతండు మీరిచ్చట వేంచేసియుండవలయుననియు, దక్షిణద్వారకయని యిది ప్రసిద్ధికెక్కి ద్వారకలో జరిగినన్ని లీలలు జరుగుచుండవలయుననియు ప్రార్థింపగా నట్లనే యనుగ్రహించెనని స్థలపురాణజ్ఞులు చెప్పిరి. క్షేత్రమునుగురించిన సాంప్రోక్తములు.

శ్రీచంపకవనంనామ ప్రసిద్ధభువనత్రయే
అమృతోద్భవబీజేభ్య స్సముత్పన్నంవనంశుభం.
నానాపక్షిసమాకీర్ణం నానామృగనిషేవితం
నానామునిజనాకీర్ణం సర్వైర్వరంలోకపూజితమ్.

శ్లో. కనకకమలవల్లీ రాత్రోరాజగోప స్సేవ్యభువనరతో దీక్షితో వాసుదేవః। కనకవిపినమధ్యే దక్షిణద్వారకాయాం నతినతజనానాం కామితార్థప్రదాతా.

సింజన్నూపురరంజితాంఘ్రికమలం జఘాద్వయాలంకృతం
జానుభ్యాంలసదూరకాండయుగళ ద్యావర్తనాభ్యుజ్వలం
లక్ష్మ్యధిష్ఠితవక్షసంగరలస ద్వేత్రం ప్రసన్నాననమ్
నానారత్నవిరాజమానమకుటం శ్రీరాజగోపంభజే.
గోపికాసనిహితైకబాహవే హేమవేత్రమితరేణబిభ్రతే
రాజగోపవపుషేనమోస్తుతే చంపకాటవినివాసినేహరే.
భుక్తిముక్తిమకరందపూరితం భక్తచిత్తకలహంససేవితం
గోబిలాదిమునిబృందపూజితం చంపకేశపదపంకజంభజే.

నమశ్చంపకవాసాయ నమశ్చంపకమాలినే
నమశ్చంపకనాథాయ చంపకేశాయ తేనమః.
శ్రీరంగం వేంకటాద్రిశ్చ సాలగ్రామంచనైమిశం
తోతాద్రిఃపుష్కరంచైవ నరనారాయణమేవచ.
దక్షిణద్వారకాభిఖ్య చంపకారణ్యమేవచ
అష్టౌమేమూర్తయస్సంతి స్వయంవ్యక్తామహీతలే.
అని యిత్యాదులుగలవు.

ఈస్వామిసన్నిధిలోనున్న బాలసంతాన గోపాలమూర్తినిపూజించి యెత్తుకొని ధ్యానించువారికి సంతానప్రాప్తియగును.

కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం
వటస్యపత్రస్య పుటేశయానం బాలంముకుందం మనసాస్మరామి.
అని ధ్యానింతురు.

కమలాలయక్షేత్రమందు వల్మీకేశ్వరధ్యానము.

యామ్యేసదంగే నగరేతిరమ్యే విభూషితాంగం వివిధైశ్చభోగైః
సద్భక్తిముక్తి ప్రదమీశమేకం శ్రీనాగనాథం శరణంప్రపద్యే. ౧
శంభోమహేశకరుణామయశూలపాణే గౌరీపతేపశుపతేపశుపాశనాశినీ
కాశీపతేకరుణయాజగదేతదేక స్త్వంహంసిపాసివిదధాసిమహేశ్వరోఽసి
హేనీలకంఠవృషభధ్వజపంచవక్త్ర లోకేశశేషవలయప్రమథేశశర్వ
హేధూర్జటేపశుపతేగిరిజాపతేమాం సంసారదుఃఖగహనాజ్జగదీశరక్ష.
స్ఫురన్నానారత్నస్ఫటికమయభిత్తిప్రతిఫలత్వ దాకారంచంచచ్ఛశధవిలాసౌఘశిఖరమ్। ముకుందబ్రహ్మేంద్రప్రభృతిపరివారం విజయతేతవాగారంరమ్యం త్రిభువనమహారాజగృహిణీ. ౪

నాగపట్టణములోమీరాసాహెబుయొక్కసమాధిను గొప్పప్రాకారములు వెండిరేకులతోడాచినతలుపులు, ద్వారబంధములు మొదలగునవికలిగిచూడతగినపనులతో బహుమాశ్చర్యకరముగ నున్నది. అనేకులువచ్చి చూచి మిక్కిలిసంతసించెదరు. మీరాసాహెబుమహిమలువారిలో బెక్కుగా చెప్పుచుందురు.

తంజావూరు విశేషములు.

ఈమహారాజధానికోటలోనుండుగృహాదులయొక్కయు, వస్తువిశేషములయొక్కయు, వివరము వ్రాయదరంబుగాదు చూచియానందింపవలెను.

అయోధ్యాదిసప్తపురీదేవతలను, శ్రీరంగాది దివ్యస్థలదేవతలను, ప్రత్యేకాలయములలో ప్రతిష్ఠింపబడినవి నిత్యోత్సవమువల్లతృప్తి జెందుచు భక్తాభీష్టములనొసంగుచు విరాజమానులగుచుండిరి. యిట్టిదేవ స్థానములు యీపట్టణములో ౮౦-లేక ౧౦౦-వరకు నుండును.

రాజమన్నారుగుడియను క్షేత్రము—సంపూర్ణము.

—()—

# కమలాలయక్షేత్రము

దక్షిణకాశీ మహాక్షేత్రము.



శ్లో. దర్శనాదభ్రసదసి జననాత్కమలాలయే
కాశ్యాంతుమరణాన్ముక్తి స్స్మరణాదరుణాచలే.

ద్వికాశీకమలాలయ ఇత్యాదిమహిమాస్పదమై హాటకక్షేత్రమని యు, కమలాలయక్షేత్రమనియు, వల్మీకక్షేత్రమనియు, శ్రీపురమనియు, చమత్కారపురమనియు, విజయపురమనియు, నిట్టినామములుగల తిరు వాలూరనెడు పంచక్రోశాత్మకమైన దక్షిణకాశిలోను

౧. శ్రీవల్మీకేశ్వరస్వామివారు యీయన ప్రధానలింగము } సోమకుంతలాంబ యీయనభార్య }

౨. వుత్సవులు త్యాగరాయస్వామివారు ఈయనభార్య నీలోత్పలాంబ
3. కమలాంబ యీమె యాదిశక్తి.

సప్తఋషులు బ్రహ్మయొక్క చిత్తస్వాస్థ్యమునుగురించి యిచ్చటతప స్సుచేయగా కమలాలయతీర్థములోనుండి ప్రత్యక్షమైనమూర్తి. యీమె ౨౮ మహాయుగములనుండి స్వామిని పెండ్లాడుట కిచ్చట తపస్సుచేయుచున్నకన్యయుట యీమెసమీపమందు సరస్వతీతీర్థమని యొకభావి దక్షిణముగానున్నది అందులో నీసిరుద్రావినవారికి చిత్తచాంచల్యముపోవునట.

౧. తిరువలూరు దక్షిణ శ్రీకాశీక్షేత్రము.
౨. గయేకరేయునెడు దక్షిణగయ దీనికి ౨-మైళ్ళు తూర్పుగానున్నది.
3. తిరుకణ్ణమంగె భక్తవత్సలస్వామి విష్ణ్వాలయము 3-మైళ్ళకు పడమరగానున్నది.
౪. దక్షిణభాగమందు ౨-మైళ్ళలో వందోంబాలే గ్రామమున్నది ఇది యుత్తరగోకర్ణమట. యీచొప్పున పదిపంచకోశాత్మకమహాస్థలమని ౨౮-అధ్యాయములుగల స్థలపురాణములోనున్నదని వింటిమి.

పూర్వమందు దూర్వాసమహర్షి తపస్సుచేయగా స్వామివారు పుట్టలోనుండియావిర్భవించి ప్రత్యక్షమైనారుగనుక వల్మీకేశ్వరులని స్వామికిపేరువచ్చినది ప్రాగ్భాగసమీపమందే దూర్వాససమాధిగుడియున్నది. ఇది స్వయంవ్యక్తస్థలముగనుక శ్రీజగన్నాథ భువనేశ్వరమహాక్షేత్రములలోవలెనే యిచ్చట తీర్థప్రసాదములు పండితపామరసాధారణముగా స్వీకరింపుచుందురు. ఈదేవస్థానమునకు రు ౫౦౦౦౦ యాభైవేలు నగదుసాలుకువచ్చునుగనుక అనుకూలముగా వుత్సవాదులు సంతతముజరుగుచుండును. కమలాలయతీర్థము విశాలముగాను పెక్కుమెట్టులు మంటపములుగలదిగానున్నది గుడిప్రాకారములో ౧౦౮-ఆలయములున్నవి. ప్రథమప్రాకారములో వేయికాళ్ళమంటపము యున్నది.

పూర్వమును ముచికుందరాజు రాక్షసయుద్ధములో దేవేంద్రునకుసహాయుడై రాక్షసులజయించినందున దేవేంద్రుడుసంతసించి స్వర్గాధిపత్యామృతపానాదికిటిపయదేవధర్మములు సెలయగానుండి యుమిగోరిన నిచ్చెదనని యె ముచికుందుండానందించి యుద్ధశ్రమకలిగియున్నవాడ గావున నేడు కోరను రేపుకోరుదునని బసకువచ్చి నిద్రించియుండగా దేవేంద్రపూ

జితుడగుచున్న త్యాగరాయస్వామి ముచికుందునకు బత్యుత్కృష్టమైననీవు మహారా జావు గనుక సంపదలు గోరబని లేదు. నన్ను గోరకొంటి వేని భూలోకప్రజలను నిన్ను మదరింప జేయుచుందువని యానతీయగా మేల్కొని లేచినంతలోంచి ముచు నాతింద్రునిపాలికేగి నీపూజలోనున్న త్యాగరాయస్వామివారి నిమ్మనుచు నిప్రార్థించగా దేవేంద్రుండీదేవుని నయితము మిన్నహాయించుకొననితనపా రపాటునకు తానేనిందించుకొని యింటిలోనికేగి మఱినాలుగైదు త్యాగరా యమూర్తులను బహుసుందరముగా సంకల్పమాత్రంబున నేసృజించి పాం ముగా నలంకరించి దీనిలో తన త్యాగరాయమూర్తిని నిరాలంకారంబుగాను సంస్కారవిహీనముగాను కనుబడునట్లుచేసి సభలోకి తెప్పించి యిందులో నీ యిష్టమైనమూర్తిని స్వీకరింపుమని తనతో ననగా ముచికుందుడు భ్రాంతిపడి కల్పితమూర్తులు సుందరముగానుండుట జూచినందులో నొకదానిని స్వీకరిం చబసకుపోయెనట.

అటుపైనింద్రుడు తనపురాతన త్యాగరాయమూర్తి తనకుదక్కినం దుకునంతసించెనట, నాటిరాత్రి యీక్షేత్రమందు స్వామివారు ముచికుందు నికి అంగింపగా మరునాడువచ్చి విధేయతగా మునుపటిమూర్తి నింద్రునకి చ్చి వేసి పురాతనమూర్తినే నిర్బంధము చేసి కోరుకొనెనట, దానికింద్రుడుక టకటంబడి తనకతడు చేసినమేలునుబట్టి యేమియుననజాలక యిదిభగవత్తం త్రముగా గ్రహించి తనమూర్తినేగాక యీకల్పితమూర్తులను సైతము ము చికుందునకిచ్చి వేసెనట.

ఆపైని ముచికుందుడు భూలోకమునకు వచ్చి యిక్కమలాలయక్షేత్ర ముదివ్యంబుగానుండుటంబట్టియు పురాణములవల్ల దీనిమహిమ వినుటంబట్టి యు నిచ్చటనుత్సవములు లేకుండుటంబట్టియు.

౧ ఈ తిరువాలూరులో దేవేంద్రపూజిత ప్రథమమూర్తియు

౨ ఇచ్చటికి నాక్షేయముగా ౮ మైళ్లలోనున్న తిరుకాంబూరులో నొకమూర్తి

౩ దక్షిణాక్షేయముగా ౧౦ మైళ్ళలోనున్న తిరుక్కారవిలలో నొకమూర్తి

౪ ఈశాన్యముగా ౨౦ మైళ్ళలోనున్న తిరునల్లారులో నొకమూర్తియు

౫ దక్షిణముగా ౪ మైళ్ళలోనున్న తిరుక్కారాయిలులో నొకమూర్తియు

౬ ఆగ్నేయముగా ౨౩ మైళ్లలోనున్న తిరుమఱైక్కాడులో నొకమూర్తియు దీనినితిరువట్టూరసికొందరనిరి ఇదిచెన్నపురికి ఉత్తరముగా ౫ మైళ్ళలోనున్న

౭ ఆగ్నేయముగా ౨౦ మయిళ్లలోనున్న వేదారణ్యములో మూలస్థానే

శ్వరుడైన శ్రీవేదగిరీశ్వరస్వామిసన్నిధిలో నొకమూర్తియు

ఇటులనుచితముంచుడు ప్రతిష్ఠించెనని వింటిమి, ఈతిరువాలూరులోని మహాలింగము స్వయంభువు, ఈయన శేవగ్ని కేశ్వరుడని పేరు 3 ప్రాకారములు. ౪ గోపురాలున్నవి ఈతిరువాలూరికి తూర్పుముగా ౨మైళ్ల దూరములో

శ్లో॥ వాయుభక్షేణయ స్తిష్ఠేత్ శ్యామబ్రతత్రయం।
తత్ఫలం ఘటికార్ధేన గయాశీర్షే తు దక్షిణే।
శ్రీరపుష్కరిణీ స్నానం రామపాదాబ్జదర్శనం।
యఃకుర్యాత్ తత్ఫణం సోపి కోటియజ్ఞ ఫలం లభేత్॥

ఇత్యాది మహాత్మ్యమునకాటపట్టు ఇహాటకక్షేత్రాంతర్గతమయి సూర్యాశ్రమమనియు దక్షిణగయయనియు రామకేశరమనియు ప్రసిద్ధికెక్కినగయేశరమను శ్రీరామగయాక్షేత్రమొకటిగలదు, అచ్చట శ్రీరామపూజితులయిన శ్రీవిశ్వనాథాన్నపూర్ణలును, గణపతికుమారచండికేశ్వరాదులునున్నవారు ఇదిగాక శ్రీరుద్రపాదములు శ్రీరామపాదములుకోవిలమంటపమందున్నవి ఇచ్చటగయలోవలెనే పిండదానములుచేయుచుందురు, ఊరికిపడమరప్రెక్కనే శ్రీరామమందిరమున్నది, దానిలోహనుమత్సీతాలక్ష్మణవిగ్రహసహిత శ్రీరామవిగ్రహమున్నది, యీదక్షిణగయామహిమ యెట్లన్నను.

శ్రీరాములవారు సీతాలక్ష్మణసహితులై వనవాసముచేయుచునిచ్చటికివచ్చియున్నప్పుడొకనాటిరాత్రి దశరథాధిపిత్రుదేవతలారాములవారికి కలలోగనపడగా రాములవారిచ్చటి శ్రీవిశ్వనాథాన్నపూర్ణాసన్నిధిలో శ్రీరుద్రపాదములయందు పిండప్రధానంబును శ్రీరపుష్కరిణీతర్పణంబును చేసిరనియు. గయతోనైనను పోనిదత్తార్షహరిణాక్షతఘ్నత్వాదిమహాపాతకములుసైతమిచ్చటనశించిపోవునని యు వింటిమి, శ్రీరపుష్కరిణీపూర్వమందుతత్రిపుష్కరిణిగానేయుండెనట. యిటీవల చోళదేశమహారాజు తాలూకు పశువులకావరియైనయొకగొల్లవాడుపశువులను మేపుటకీ ప్రాంతమునకు తోలుకొనిరాగా నందొకయావుమందనువిడిచి యీపుష్కరిణికునచ్చువరకు దానిపాదుగులోని పాలన్నియు అంతటతామే కారిపోయినందున నట్టియావుమాత్రమే తరలమందలోగలని రాజమందిరమునకుపోగా వారు దానికి పాలులేకుండుటచూచి కాపరిత్రాగివేసినాడని శిక్షించిరట.

ఒకనాడు కాపరిశిక్షనుసహింపలేకయీయావును వెంబడించిపోయి యదారప్రకారమిచ్చటికదివచ్చి యెప్పటివలెనే పాలుకారి పట్టిహదుగుతోవ

చ్చుచుండుటనిదానించిచూచి యీసంగతిచోళమహారాజుతో వాడువిన్న వించినవినియతండాశ్చర్యపడియిచ్చటికివచ్చిచూచియీస్థళమందు భగవత్ప్రేరితుండై త్రవ్వింపగానదరువిశ్వనాథాన్నపూర్ణలుస్వయంభువులై ప్రత్యక్షమయినంగని యపరాధక్షమాపణపూర్వకంబుగా ప్రార్థించివారికి గుడికట్టించిపూజకాగములేర్పరించి తనయావుపాలుకారినస్థళమునకు క్షీరపుష్కరిణియనుపేరుపెట్టిరనియుక్షీరపుష్కరిణిలోగంగయమునసరస్వతి గోదావరికృష్ణ తుంగభద్ర కావేరీ తామ్రపర్ణీ సరయువునను దేవగంగలున్నవనియుస్థలపురాణములోనాయాపద్విశేషములుండెను, తిరువాలూరుక్షేత్రమహాత్మ్యములోనానాగరఖండమునందిపంచక్రోశమహిమగలదట, క్షీరపుష్కరిణిత్వ. రక్తపుష్కరిణిత్వకారణంబులున్న, తన్నిమాపకకథావిశేషంబులు నందులోనానేకలవట.

* హాటకక్షేత్రే ప్లక్షవృక్షచ్ఛాయాయాం, గయాయాం. శ్రీవిశ్వనాథాదిదేవతాసన్నిధౌ, అనియిచ్చట సంకల్పము, గయలోనక్షయవటము వలెనేమ త్తిచెట్టున్నదిఅందువలసదానినిప్లక్షవృక్షచ్ఛాయాయాంఅందురు.

౧ ధ్యాయేదాజానుబాహుంధృతశరధనుషంబద్ధపద్మాసనస్థం
పీతంవాసోవసానంనవకమలదలస్పర్ధినేత్రంప్రసన్నమ్।
వామాంకారూఢసీతాముఖకమలమిలల్లోచనంనీరదాభం
నానాఽలంకారదీప్తందధతమురుజటామండలంరామచంద్రమ్॥

౨ ధ్యాత్వానీలోత్పలశ్యామంరామంరాజీవలోచనం।
జానకీలక్ష్మణోపేతంజటామకుటమండితమ్॥

౩ సాసితూణధనుర్బాణపాణింనక్తంచరాంతకం।
స్వలీలయాజగత్త్రాతు మావిర్భూతమజంవిభుమ్॥

## శ్రీవిశ్వనాథాన్నపూర్ణలధ్యానము.

౧ హేవిశ్వనాథశివశంకరదేవదేవగంగాధరప్రమథనాయకనందికేశ
బాణేశ్వరాంధకరిపోహరలోకనాథసంసారదుఃఖగహనాజ్జగదీశరక్ష

౨ కైలాసాచలకందరాలయకరీగౌరీఉమాశంకరీ
కౌమారీనిగమార్థగోచరకరీఓంకారబీజాక్షరీ

* ప్లక్షవృక్షమనగాజువ్విచెట్టుఅందురు.

మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహికృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ॥

కమలాలయక్షేత్రమందువల్మీకేశ్వరధ్యానము.

౧ యామ్యేసదంగేనగరేతిరమ్యే విభూషితాంగం వివిధైశ్చభోగైః
సద్భక్తిముక్తిప్రదమీశమేకం శ్రీనాగనాథం శరణంప్రపద్యే

౨ శంభోమహేశకరుణామయశూలపాణే గౌరీపతేపశుపతేపశుపాశనాశిన్
కాశీపతేకరుణయాజగదేతదేకస్త్వంహంసిపాసివిదధాసిమహేశ్వరోసి

౩ హేనీలకంఠవృషభధ్వజపంచవక్త్ర లోకేశశేషవలయప్రమథేశశర్వ
హేధూర్జటేపశుపతేగిరిజాపతేమాం సంసారదుఃఖగహనాజ్జగదీశరక్ష

౪ స్ఫురన్నానారత్నస్ఫటికమయభిత్తిప్రతిఫలత్స్వకాకారంచం
చచ్ఛరధవిలాసాఘశిఖరమ్ముకుందబ్రహ్మేంద్రప్రభృతి
పరివారంవిజయతేతవాగారంరమ్యంత్రిభువనమహారాజగృహిణీ

దక్షిణగయయనెడుశ్రీరామగయాక్షేత్రముసంపూర్ణము.

---

## శ్రీకుంభఘోణమహాక్షేత్రము.

### ఇచ్చటిదేవస్థాన విశేషములు.

| | | |
|---|---|---|
| ౧ | కుంభఘోణేశ్వరుడు | మంగళాంబిక |
| ౨ | శ్రీరామస్వామివారు హనుమదాదిసహితులుసాలగ్రామశిల | సీతాదేవి |
| ౩ | శార్ఙపాణిస్వామి | కోమలవల్లి |
| ౪ | చక్రపాణిస్వామి | విజయవల్లి |
| ౫ | నాగేశ్వరుడు | జ్ఞానప్రసూనాంబ |
| ౬ | సోమేశ్వరుడు | సోమసుందరి |
| ౭ | బాణపురీశ్వరుడు | బాలాంబ |
| ౮ | అవిముక్తేశ్వరుడు | అమృతవల్లి |
| ౯ | శ్రీకాశీవిశ్వేశ్వరుడుపెరిగుడిలో నవగంగావిగ్రహములున్నవి | అన్నపూర్ణాదేవి |
| ౧౦ | ఐరావతేశ్వరుడు | అభయాంబ |

| | |
|---|---|
| ౧౧ గౌతమేశ్వరుడు | త్రిపురసుందరి |
| ౧౨ భూవరాహస్వామి | అమ్మవారిపేరు తెలియలేదు |

ఇందులో ౮ శివాలయములు.

నాల్గువిష్ణ్వాలయములుఅయియున్నవి వీట్కి అన్నింటికినాలుగు ల
క్షవడి వేలరూపాయీలువరకునువచ్చుచుండునట.

౧ అమ్మవారుమంగళాంబచతుర్భుజములుగల్గినవృచున్నట్లున్నారు.

౨ చక్రపాణిస్వామిఅష్టభుజుడు త్రినేత్రుడు-జటామకుటధారి - బ్రహ్మాగ్ని
సూర్యసహితుడు-నైయుండెను-తొల్లిబ్రహ్మాగ్నిసూర్యులకు ప్రత్యక్షమా
య్యెనట-యీస్వామివారికిరత్నకవచాదులున్నవి.

సూతుడు చెప్పుచున్నాడు.—ఋషులందరువినదగినది, పాపములను
పోగొట్టునదియు, భోగమోక్షములనిచ్చునట్టిదియు, ఉత్తమోత్తమమయిన
దియునైనదికుంభఘోణక్షేత్రము, ఇందుకుపెరాతనమయినదియు శ్రీమహావి
ష్ణువుచేత చంద్రునికి చెప్పబడినదియునయిన యీయతిహాసమిచ్చట నుదా
హరించుచున్నారు.

పూర్వముసంపత్తునుకోరి చంద్రుడుసమస్తసిద్ధులనిచ్చునట్టిశ్రీరం
గక్షేత్రమందు శ్రీరంగనాథస్వామిని హృదయకమలమందుధ్యానించి య
థాధిగాపూజించగాభగవంతుండయిన శ్రీమహావిష్ణువుఅతనికి ప్రసన్నుడు
కాగాచంద్రుడుఆప్రసన్నుడైన శ్రీమహావిష్ణువునుచూచి ముందునిలిచి చేతు
లుజోడించుకొనిదేవదేవుడవుజగన్నాథుడవు ప్రణతార్తిభంజనుడవునైన
నీవుయచ్యుతుండాఅసాధారణమయినదియు, సమములేనిదియునైన ఐశ్వ
ర్యమునుయివ్వవలయుననియుత్తమోత్తమమయినవరమును వేడగావిని
విభగవంతుడునుగ్రహనిధియునైనశ్రీమహావిష్ణువుమహాభాగుడా, ఇప్పుడు
లోకమాతయైనమహాలక్ష్మిభూలోకమందున్నది.ఆమెనుసేవించుముసంప
త్తునుఆమెఇచ్చును,సంశయములేదు, అనిసెలవివ్వగాచంద్రుడిట్లనియెలో
కనాథుడవుప్రభువునయినయోస్వామీ.నిర్మలయునీభార్యయునయినఆమహాల
క్ష్మియెచ్చటనున్నది ఆకారణమును ఆనతీయవలయునని ప్రార్థించినభగ
వంతుండిట్లనియె.ముందునేమదుష్టనిగ్రహశిష్టపరిపాలన ధర్మసంస్థాపనము
కొఱకు, మత్స్యకూర్మాద్యవతారముల నెత్తుచుండగా, అనావిరహముయ
సహింపలేక, సర్వదా లోకనాథుడనయిన నాతోకూడానాకెత సేయుచుం
డవలయునని, సర్వసిద్ధిపేవితంబును, మహాక్షేత్రమునయిన కుంభకోణము

లందులక్ష్మీసరోవరమునంగల స్వర్ణపంకజాటవియందు సర్వమంగళస్వైన మహాలక్ష్మి, యెల్లప్పుడునన్నుధ్యానించుచున్నదానిపరితాపమును సహింపలేకనేనుముందుఅచ్చటనేయుంటిని. కాబట్టిఅనుత్తమమను క్షేత్రరాజమునయిన ఆకుంభకోణక్షేత్రమునుగురించిపొమ్ము నీకుక్షేమముగునని చెప్పగా, చంద్రుండిట్లనియె. ఓకమలాపతివయినస్వామీ అది యెంతదూరమునను న్నదియాక్షేత్రమునకుఫలమేమిదానిందెలిసికొని నిచ్చటగలిగియున్నది ఇచ్చటనేనెలవిచ్చవలయునని ప్రార్థించినసతనికి శ్రీమహావిష్ణునిట్లనియె. ఇచ్చటికినాలుగుయోజనదూరమున తూర్పునఉత్తమోత్తమమయినకుంభకోణమను క్షేత్రమున్నది, అందుసరస్తీరమందుస్వర్ణపంకజాటవియందు శ్రీమహాలక్ష్మియున్నది, ఆసరస్సులక్ష్మిచేతపరిశుద్ధహృదయముగా తపస్సుచేసినిర్మింపబడినందున దానికి లక్ష్మీసరోవరమని పేరు మొదటగూడఆక్షేత్రము దేవగణములచేతనుఋషిగణములచేతను సేవింపబడినది,ఆక్షేత్రమును బుధులు కర్మవృద్ధికరమయినదిగా జెప్పుదురు. కుంభకోణక్షేత్రమందు మరణమును బొందినవారికినాలోకమేసర్వదావాసమగును, తొల్లి బ్రహ్మచే ఈకుంభకోణక్షేత్రము లోకసృష్టికై సేవించబడినది పూర్వము శ్రీమహాలక్ష్మిచేత లోకరక్షార్థముగలగాదిసమస్తతీర్థములనుసంగ్రహించిఆపవిత్రకరమగునసరోవరమునిర్మింపబడినది, అందుప్రతివర్షము బ్రహ్మ మొదలైనదేవతలు ఋషివరులునువచ్చి స్నానముచేసి వారివారిస్థానములకు వెళ్ళుచున్నారు, ఓనిశాకరుడా, ఒకదినమయిననిచటస్నానముచేసినవాడు సర్వపాపములచే విడబడినవాడయి స్వర్గలోకమునుబొందుచున్నాడు, సుక్షేత్రమయిన ఈ కుంభకోణక్షేత్రమందు మూడురాత్రులు వాసముచేసినవారలకు ప్రళయపర్యంతము బ్రహ్మలోకవాసమగును. ఏమనుష్యుడుభక్తియుక్తుడైలచ్చిమిసరోవరమందు స్నానముచేసియెదానముచేసినను అదిపితృదేవతలకు ముక్తిప్రదము, ఓచంద్రుడా, పుణ్యక్షేత్రములన్నియు బహుతీర్థములును పుణ్యమునుకోరినవయి యెల్లప్పుడునచ్చట వాసముచేయుచున్నవి, ముల్లోకమందును దానికిసరియైనక్షేత్రములేదు, ఇతరక్షేత్రమందు చేసినపాపము పుణ్యక్షేత్రమందునశించును. పుణ్యక్షేత్రమందు చేసినపాపము వారాణసియందునశించును, వారాణసియందు చేసినపాపము కుంభకోణమందు నశించును, కుంభకోణమందు అర్ధక్షణమయినవాసముచేయువాని పుణ్యఫలమును చెప్పుటకు చతుర్ముఖుడైన బ్రహ్మచేతకూడ శక్యముకాదు మహా

దేవుడును గిరిజాపతియు నైన కుంభేశ్వరుడచ్చట వుంటున్నాడు, మహానుభా
వుండగు చంద్రుడా నీవచ్చటికిం బొమ్ము నీయిష్టసిద్ధి కాగలదు, అని వరమిచ్చె
నుమాతుండిట్లనియె. ఇట్లు దేవదేవుండగు శ్రీమహావిష్ణువు చంద్రునికి వరము
నిచ్చియచ్చట నేయంతర్ధానము నొందెను, ధర్మాత్ముండైన చంద్రుడును ఆ
చ్చటికిం బోయి లక్ష్మీసరోవరమందు స్నానము జేసి సురేశ్వరియైన మహాలక్ష్మిని
చక్కగా పూజించి తనచేతం గోరబడినదియు శుభకరమయినదియు నైన ఇష్టసి
ద్ధిని పొందెను, ఇదిగాక దేవగురువైన బృహస్పతియు నచ్చటనే యుత్కృష్టమా ఇ
వమంగళము గలదియు మిక్కిలి సౌందర్యము గలదియు తామర రేకులవంటి
కన్నులు గలదియు, చంద్రుని చేత నపహరింపంబడినదియు, భార్యయు నగు తా
రను పరమేశ్వరుని వల్ల మృతసంజీవని విద్యయును పొందెను. సూర్యపుత్రుడై
న శనీశ్వరుడు, రాహువు, కేతువు, కుజుడు మొదలైనవారందరు ఇచ్చట బహు
కాలము తపస్సు జేసి గ్రహముల యొన్నికకు వచ్చిరి, హరిశ్చంద్రుడు, నలుడు, పు
రుకుత్సుడు. పురూరవుడు, సగరుడు, కార్తవీర్యుడు, ఈ చక్రవర్తులున్ను
యిచ్చట నీశ్వరుని గురించి మంచి వ్రతములు గలవారై తపస్సు జేసి అతని కృ
ప జేత లోకమందు ఖ్యాతినిన్ని సత్వమునున్ను ధర్మశ్రీలనున్ను మహాధ
నమునున్ను పొందిరి, యీ క్షేత్రమందు సమస్త దేవతలును, సమస్త తీర్థము
లును వుంటున్నదనుటకు నిదర్శనముగా యిప్పటికిని కుంభేశ్వర, సోమేశ్వర,
నాగేశ్వర, కాళహస్తీశ్వర, బాణపురీశ్వర, విశ్వేశ్వర, అభిముక్తేశ్వర, గౌరీ
శ్వర నామములు ప్రసిద్ధిం బడసిన యెనిమిది ఈశ్వర దేవాలయములును శార్ఙ్గపా
ణి చక్రపాణి, రామస్వామి శతనారాయణ గోపాల, వరాహ, నామములచే ప్ర
సిద్ధిం బడసిన ఆరు విష్ణు దేవాలయములున్ను మరియు కావేరియు, లక్ష్మీసరస్స
ను పొత్తామర కొలను మహామఘ కొలనును ప్రసిద్ధముగా వున్నవి, సింహరా
శియందు బృహస్పతియుండగా మాఘమాసమందు మఘానక్షత్రమునా
డు గంగ మహామఘ కొలను లోపల విర్భవించుట చేత నప్పుడు ఆ క్షేత్రమందు
గల సర్వదేవతలకును బ్రహ్మోత్సవము జరిగించబడి ఆదినము ఆ కొలను లో
తీర్థమిచ్చి అవభృథస్నానము సేయుట చేత నాదినమునందు ఆ కొలను లోను
లక్ష్మీసరస్సు లోను కావేరి లోను స్నానము జేసి దానాదులు జేయువారలకు
యిహమందు సకలభోగానుభవమును, పరమందు శాశ్వత బ్రహ్మలోకవా
సమును కలుగును, ఇది నిశ్చయము, పుణ్యకరంబును సర్వపాపహరంబును,
శ్రేష్ఠమునయిన యీ యాఖ్యానమును విన్నవారలకును, చదివిన వారలకు

ను చదివించినవారలకును, దానముచేసినవారలకును నిశ్చయముగానదే
శ్రీకారముసంతుష్టుకలుగును.

శ్రీరంగమహిమ యెట్లన్నను.

శ్లో॥ మాతృభూతేశ్వరోదేవో మాతృవత్పాలయేప్రజాః।
మాతృగర్భనివాసోంతినవున స్తస్యదర్శనాత్ ॥
శ్లో॥ శరనదంసుఖదంశరణాన్వితంశివశివేతినతంనృణాం।
అభయదంకరుణావరుణాలయం భజతరేమనుజాగిరిజాపతిమ్॥
శ్లో॥ జగదంబవిచిత్రమత్రికింపరిపూర్ణాకరుణాస్తిచేన్మయి।
అపరాధపరంపరావృతంనహిమాతాసముపేక్షతేసుతమ్॥

అనియిత్యాదిమహిమలుగలవు, వీరికిషట్కాలపూజలుగావింపుచు
నిత్యముసేవింపుచు, త్రిశిరుడనెడురాక్షసుడొకజన్మమందేతరించెనట త్రిశి
రోపరదానార్థమయియావిర్భవించినయీమాతృకాలకతండు పునఃప్రతి
ష్ఠకావించెనని వింటిమి.

శ్రీమన్నారాయణమూర్తి నలనన్నపహ్యాదియందు బ్రహ్మకును, బ్ర
హ్మవలనమనుచక్రవర్తికిని, మనువలననిక్ష్వాకునకును త్రేతలెగా శ్రీరా
ములవారివ నవిభీషణునకునుసంప్రాప్తము ఇవిభీషణుడులంకకెరొకిగొనిపో
వుచుండగానుభయకావేరిమధ్యభాగమందు విభీషణుడుమలమూత్రవిసర్జ
నార్థముఇపోవునప్పుడుకపటబ్రాహ్మణవేషధారియైనగణపతిచేతికివ్వగానతడు
షరతుప్రకారముమ్మారుపిలచివిభీషణుడురానందున దిగువను దేవతాసంపు
టమునిలిపిపోయినవెంటనే విభీషణుడువచ్చి సజ్జయిశక్తిఅదికదలనందున
భక్తిల్లిప్రార్థించగా గంగకన్ననదికురాలనగుదు కాకయునితవన్సుజేసిన కా
వేరికివరదానకాలమయినందున నేనిచ్చటనిలిచితికావున విషాదమువాని
నీవులంకకుబోయి నిత్యమువచ్చి సేవింపుచుండుము శ్రీస్వామివారానతిచ్చి
రి గనుకయీవిమానముయీస్వామిఅప్రాకృతమూర్తులనిస్థలపురాణము
నందున్నదని ప్రీవాసులని తీర్థప్రియుక్తవతనపురస్సరముగా శ్రీకావే
రిస్నానంబుజేసి ప్రాకారదక్షిణంబుగా గుడికిబోయిగరుడాదిపరివారసహి
తంబుగా మూలవిరాటయినశ్రీరంగనాయకులను అయిదో ప్రాకారము
లోనొకమందిరంబునందు చేంచేసియున్న శ్రీదేవి భూదేవి రంగనాయకీ
దేవిత్రయంబును సావధానముగా సేవించవలయును.

శ్లో॥ సప్తప్రాకారమధ్యే సరసిజముకుళోద్భాసమానే విమానే
కావేరీమధ్యదేశే మృదుతరఫణిరాడ్భోగపర్యంకభాగే
నిద్రాముద్రాభిరామం కటినికటశిరః పార్శ్వవిన్యస్తహస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగనాథం భజామి
అను శ్లోకమునందుదహరింపబడినరీతిగా నేదర్శనమగును

శ్లో॥ కావేరీవిరజాసేయం వైకుంఠం రంగమందిరం
సవాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్॥
ఇదంహిరంగం త్యజతామిహాఙ్గం పునర్న చాఙ్గం యదిచాఙ్గమేతి
పాణౌరథాఙ్గం శయనేభుజఙ్గం యానేవిహఙ్గం చరణేచ గఙ్గమ్.

అని యిట్లుపఠించి భావింపుచూ జనులు స్వామిదర్శనము జేయుచుందురు॥

౧ ప్రథమప్రాకారమధ్యమందే ఆజానుబాహువుగా పశ్చిమశిరస్సుగా శేషశాయిగా సాలంకారముగా శ్రీరంగనాయకులవారు కించదున్నతమైన చతుఃకలశాలంకృతశిఖరమైనవిమానములో లంకాభిముఖముగా శయనించియుండిరి, యుత్సవులు విభీషణగరుడులు, సన్నిధిలోనుండిరి.

౨ ద్వితీయప్రాకారమునకు ప్రదక్షిణప్రాకారమని యొకపేరుగలదు, అందులో శ్రీవిష్వక్సేనులు వేంచేసియున్నారు, యీప్రాకారములో తూర్పుకోణేయందిత్తడిపద్మమున్నచోటనిలువబడి రంగనాథవిమానమును దర్శించునప్పుడుపరవాసుదేవులదర్శనమగును, ముఖ్యముగాదర్శించవలెను ఇందులోనే యుత్తరమందు వెసవిలో శ్రీస్వామివారికి శీతలోపచారములకై తీర్థముతోడి తెప్పనుయ్యియున్నది, దీనినిజలిపిప్రదక్షిణముగా నేపోవలెను యీమూలకి నాలుగుబారలమేర యీశాన్యముగాపోయి యుత్తడిచక్రమున్నచోటనిలువంబడిచూచినచో నాలుగుకలశములుగల శ్రీరంగనాయకిమందిరశిఖరము కనంబడునుగనుకదర్శనముచేయవలెను.

శ్లో॥ విమానంప్రణవాకారం వైకుంఠంరంగమందిరం
పరవాసుదేవోరంగేశః ప్రత్యక్షం పరమంపదమ్.
ఇటులపఠించి మ్రొక్కుదురు.

౩ తృతీయప్రాకారములో విజయరంగచొక్కనాథాదులప్రదక్షిణము, దీనినేమధ్యమతస్థులవశాహప్రదక్షిణమందురు.

౪ చతుర్థప్రాకారమున గరుడమంటపమున్నది, స్వామికెదురుగా చేతులుజోడించినట్లుగరుత్మంతుని గారతో తయారుచేసి నాగాభరణమునుం

ధిరంగుపూరించి పఠిష్ఠించి గావున వారిసినేవించవలయును, యిందులో కొటారికి ( దక్షిణముచేయవలెను, ఇ దులోనేచంద్రపుష్కరిణియు,విష్ణు పాదములుగలపొన్న చెట్లునుంగలవు, నిచ్చటహిరణ్యశ్రాద్ధముచేయుదురు

౫ పంచమప్రాకారములో శ్రీరంగనాయకియును నమ్మవారిమందిరము,ఆళ్వారాదులసన్నిధియు వేయుకాళ్ళమంటపముమహాబలిపీఠముబిల్వవృక్షముదర్శనముగాశ్రీరామానుజులవారినమాధిస్థలముఅచ్చటనేవీళ్ళలో కాచార్యులవారిపతిమయుగలవు,యీయైదవప్రాకారమునేఅయిదుగుంటలమూడువాకిలియందురు, అందులోనేయమ్మవారికొప్పుడుతేనదైయెదు వేశ్ళతోగుంటలుతీసినపద్మాకారపుశిలయున్నది, ఆశిలకు త్తరసన్నిహితపార్శ్వమందుఅమ్మవారుదక్షిణముఖముగానిలువబడి అక్కడికెదురుగా దక్షిణముఖముగానున్న( మోక్ష )పరమపదద్వారమందు వేంచేసివున్న శ్రీరంగనాయకులవారినిముక్కోటియేకాదశినాడుతొంగిచూతురట, ముక్కోటియేకాదశి మొదలుపదిదినంబులప్పరమపదద్వారముతెరచియుంచుచుతక్కినకాలమునమూసివుంతురు,ముక్కోటియేకాదశియనగాప్రతిసంవత్సర.

౬ యారవప్రాకారము ఉత్తరవీధియనవాళమహామునిప్రదక్షిణమందురు,

౭ ఏడవప్రాకారము చిత్రవీధియందురు,దీనిప్రదక్షిణమును భూప్రదక్షిణమందురు.

౮ నూతనకల్పితమైనది దీనిలోశూద్రాదులుందురు.

వీనిలోనయిదుప్రాకారములుశ్రీరంగనాయకసంబంధములెదుఅరవప్రాకారములోద్రావిడులు, ఏడవప్రాకారములో దేవాచ్ఛాదిశ్రీవైష్ణవులు, యెనిమిదవప్రాకారములోశూద్రగృహములుఅంగళ్లుగలవు,శ్రీరంగమహాక్షేత్రమువినుతపాత్రమైయున్నది.

ప్రతిదినపూజకాలములు.

౧ ఉదయాదియేడుఘంటలలోపల విశ్వరూప దర్శనమగును,అనగాశ్రీరంగనాయకులవారురాత్రిశేయనించిలేచువఱకొకవైణికుడు వీణవాయింపుచుండును తరువాతవరునబడియర్చకులుసోత్సవముగాకావేరితీర్థము దెచ్చియుంచిగుడితలుపులుతెరచెము తెరచిలోపలికేగిస్వామివారికి దర్పణదర్శనముదంతధావనముముఖప్రక్షాళనము, దీపారాధనము, నవనీతభోగము చెల్లించినన్నిధిమంటపములోకట్టియుంచినతెరలో వెనుకతిరిగియున్న

గోపురయొక్క పృష్ఠభాగము స్వామి వారికి కనబడునట్లు సంఘటించియుంచిన కాలమంతా రతియిచ్చును, గుడితలుపులు తెరచియుండగా భక్తులు వస్త్రులు దిర్చి చేతులు జోడించుకొని నిలువంబడి ముందుగా గోపృష్ఠమును జూచి పవిత్రులయి వెంటనే శ్రీరంగనాయకుల సర్వాంగదర్శనము చేయుచుందురు. దీని నే విశ్వరూపదర్శన మందురు.

౨ తొమ్మిదిఘంటలకు బాలభోగారాధనము పాలు, రొట్టె, వెన్న పప్పు నివేదింతురు.

౩ పదిఘంటలకు పొంగలి, దోసెలు, అతిరసము మొదలగునవి నివేదింతురు.

౪ పన్నెండుఘంటలకు పెద్దయువసర మందురు. ఇదే రాజభోగావసరముగనెం శాలిబియ్యమన్నము, కూరలు, పప్పు, పులుసు, క్షీరాన్నము పిండి వంటలతోను ఆరగింపు చేతురు శ్రీఅమ్మవారిసన్నిధిలో కూడా నివేదింతురు

౫ ఆరుఘంటలకు క్షీరాన్నమారగింపు చేయుదురు.

౬ పదిఘంటల రాత్రికి కలశంబాయుని పట్టిప్రసాద మారగింపు చేయుదురు.

౭ పదకొండుఘంటల రాత్రికి ఆరణియనగా పొంగలి మొక్కలోట కూర అమ్మవారిసన్నిధిలో నారగింపు చేయుదురు.

౮ పదకొండుఘంటల రాత్రిపైన శయనావసరములో పాల్యారగింపు చేయుదురు.

శ్రీరంగనాయకుల వారికి సాలు ౧ కి రు ౧౦౬౦౦౦౦౧ క్షా లక్ష వేల రూపాయలు నగదు వచ్చుచుండును. దీనినంతను ఖర్చు చేయుచుందురు.

నిత్యము శ్రీస్వామి వారికి కస్తూరితోనే తిలకముంచుచుందురు

భక్తులు చేయించు ఉండు భోగములనేకముగా చెల్లించబడుచుండును

ఇచ్చట సంకల్పము.

పాండ్యదేశే శ్రీరంగక్షేత్రే భాస్కరక్షేత్రే రంగనాయకీసమేత శ్రీరంగనాయకసన్నిధౌ అఖిలాండేశ్వరీసమేత శ్రీజంబుకేశ్వరస్వామిసన్నిధౌ కావేరిస్నానమహం కరిష్యే యని చెప్పుదురు.

౧ శా॥ శ్రీవైకుంఠము రంగమందిరముగా శ్రీభూసతుల్ గొల్వగా।
కావేరీతటమందు శేషఫణిభోగంబూని కాయోగసి।
ద్రావిభా జితుడయిన పుణ్యపురుషుల్ రాజీవనేత్రుల్ మహా।
త్మ్యా ప్రీతుమహానుభావులు తుల శ్రీరంగనాథుల్ విభుల్॥

శ్లో॥ నమస్తేఽస్తు మహామాయే శ్రీపీఠేసురపూజితే।
శంఖచక్రగదాహస్తేమహాలక్ష్మినమోఽస్తుతే॥
సర్వజ్ఞేసర్వవరదేసర్వదుష్టభయంకరి।
సర్వదుఃఖహరే దేవిమహాలక్ష్మినమోస్తుతే॥

శ్రీరంగమహాక్షేత్రము
సంపూర్ణము.

---

శ్రీరంగమునకు ప్రాగాజ్ఞేయగా రెండుమైళ్లదూరములోనున్న శ్రీఇంబుకేశ్వరములో వేంచేసియున్న శ్రీజంబుకేశ్వరస్వామివారికిభార్యయైన శ్రీమదఖిలాండేశ్వరియను నమ్మవారినిముందుగాసేవించుకొనితర్వాత శ్రీస్వామివారినిసేవించుట ఆచారమయియున్నది, యీజంబుకేశ్వరుడుపంచభూతలింగములలో అప్లింగమందురు, దానికినిదర్శనముగాగర్భాలయము లోనుఎంతవేసవిలోనైననునీరూరుచుండును, నాలుగుగోపురములుప్రాకారములున్నవి, వెలిప్రాకారములో వేయికాళ్లమంటపమున్నది, ఫాల్గుణశు ౧ మొదలుచైత్రశుపదహాఇదువరకును బ్రహ్మోత్సవమనియుమండలోత్సవమనియుధ్వజారోహణోత్సవమనియుపేర్లుగలమహోత్సవముజరుగుచుండును.

దిక్పాలక, పంచపాండవ, పంచకన్యాదిశిలావిగ్రహములు ప్రాకారపార్శ్వవేదికామందిరములయందుపూజలనొందుచున్నవి.

౧ అగస్త్యతీర్థము
౨ కాశీతీర్థము
౩ బ్రహ్మతీర్థము
౪ జంబూతీర్థము
౫ సీమతీర్థము
౬ రామతీర్థము
౭ సూర్యపుష్కరిణి
౮ చంద్రపుష్కరిణి
౯ విష్ణుతీర్థము

అనునివినిచ్చటతొమ్మిదితీర్థములున్నవి ఇందులో పూర్వమందుపార్వతిదేవి తపస్సుచేయుచుండగాగ్రీష్మకాలములోనీరులేకపోయెనట, అప్పుడుకావేరిసైకతమందుచెలమత్రవ్వి ఆజలముతోస్వామికభిషేకించిరట, ఆదేసీమతీర్థమనియిప్పుడుప్రసిద్ధముగా వ్యవహరింపబడుచున్నది, అది గుడిలెరాలింగమునుచుట్టునునిత్యమును బహుగా జలమూరుచుండును.

ఈక్షేత్రమునుగురించినకథ.

కైలాసపర్వతమునందుశివుడు తాండవముసేయుచుండగాపార్వతీదేవినిందుసభలోనవ్వెనట, దానికిశివుడుకోపించియీనవీన అపరాధము

పోవుటకు భూలోకములో దండకారణ్యమునందు తపస్సు చేయుమని పార్వతి
కి శాపంబిచ్చెనట. పార్వతియు దండకారణ్యములోనున్న యియ్యుభయకా
వేరిమధ్యద్వీపమునందుగల జంబూవనమందు మహోగ్రతపస్సు చేయుచుని
త్యారాధననిమిత్తమొకసికతాలింగమొనరించుకొని పూజింపుచుండగా మ
రికొంతకాలమున కుభయకావేరులు గలసివచ్చినంత ప్రవాహముకాగా స్వ
ప్రతిష్ఠితసికతాలింగమునకు భంగము వచ్చునన్న భీతిచేత లింగమును కౌగలిం
చుకొని బోరగిలగావంగి పార్వతి ధ్యానింపుచుండెనట, అంతలో శివుడు పార్వ
తిభక్తికి మెచ్చి ఆసికతాలింగమునందే ప్రసన్నుడయ్యెనట, యిటీవల కలియు
గములో చోళదేశాధీశ్వరుడు జంబూవనమందున్న యీశివునకు జంబుకేశ్వ
రుడనియు పార్వతికి అఖిలాండేశ్వరియనియు పేళ్లు పెట్టి పునఃప్రతిష్ఠగావిం
చి వారిద్దరికిని గోపురప్రాకారమంటపమందిరాదులు కట్టించి భోగరాగము
లకు తగిన దేశము సమర్పించెనట, చిరకాలవియోగజనితపరస్పరప్రీతివిశే
షముచే నీజంబుకేశ్వరుడనెడు శివుడియ్యఖిలాండేశ్వరియను నమ్మవారియం
దుయావద్యాజమాన్యము నిలిపి పంచప్రాకారపరివేష్టితమైన యీదేవళమం
దుప్రతిచైత్రిసంగకి రూపవినియమముగలిగి అనగా శివవేషము పార్వతి
పార్వతివేషము శివుడు ధరించి విహరింతురు. గనుక తాదృశవేషములం పార్వ
తీపరమేశ్వరులకు తాగుమారుగా వేయించి మహోత్సవము జరిగింపుచుందు
రు. ఒకయేనుగు నిత్యము తుండముతో జలము తెచ్చి యీశివున కభిషేకింపుచు
న్నందున శివుడనుగ్రహించి దానికిచ్చట నేముక్తినిచ్చెను గనుక యీక్షేత్ర
మును గజారణ్యమందురు.

మునుపొకని తపస్సు చేయుచుండగా నతనిచేతిలో నొక నేరేడుపండుప
డెనట, దానినతడు భగవదర్పితముచేసి తానుభక్షింపుచుండెనట, నిత్యము ని
ట్లు జరుగుచుండగా తానొకనాటి ఫలములు శివునికర్పింపగా శివుడు ప్రత్యక్షము
గా భక్షించి గింజను మియ్యంగ నియమ్ముని యాగింజను క్రిందపడకుండ బట్టుకొని
శివప్రసాదమని భక్షింప నుద్యుక్తుడగుచుండగా వలదని శివుడు వారించెన
ట, వారించి ననుమానకమున దానినిమ్మింగెనట. శివునకు దానివలన నిగ్రహా
నుగ్రహములు రెండును గలిగినా ఆజ్ఞనుల్లంఘించితివి గావున నేరేడుచెట్టు నీక
డుపులో బుట్టును, గాబట్టిర్ఘూమువరకును దానిభారమున నీవు మోయుమని
యు తర్వాత తత్తాదాత్మ్యమునొంది అనగా నేరేడుచెట్టువె నీవయి నాలోక్య
మునొందుమనియు నానతిచ్చెనట, అందువలన నీస్థలము జంబూవనమయ్యె

వనియుజంబూవనమందుఋషికి ప్రత్యక్షమైఋషిని జంబూవృక్షముగానుం డునట్లుశాశించుటంబట్టిశివునకు జంబుకేశ్వరనామమువచ్చెననియు స్థలపు రాణమందున్నదని తత్పురాణజ్ఞులుచెప్పిరి, యీస్వామివారికి సాలినారు ౧౨౦౦౦.౦,పన్నెండువేలరూపాయలురాబడికలిగియుండుటవలన అనుకూలముగాభోగరాగములుజరుగుచున్నవి,యీయఖిలాండేశ్వరీదేవికిశ్రీశంకరాచార్యులవారుశ్రీచక్రములురెండురత్నతాటంకములుగా యథాశాస్త్రంబుగాచేయించిసమర్పించిరి, బహుసుందరముగానున్నవి.

అఖిలాండేశ్వరీ ధ్యానశ్లోకము.

౧ శ్రీచక్రద్వయమబ్జరాగమణిభిస్తాటంకయుగ్మాత్మనా
శ్రీమచ్ఛంకరదేశికేంద్రమణిభిర్నిర్మాపయిత్వార్పితమ్
యత్కర్ణద్వితయేచకాస్తిజగతాంపిజ్ఞప్తుమభ్యాగతౌ
బింబౌపుష్పవతోశ్వరిత్రవిపతాంనందేఖిలాండేశ్వరీమ్॥

జంబుకేశ్వరధ్యానము.

౨ దృష్ట్వావతీనమూర్తనస్మితముఖభూత్వాదశేస్తానతీ
తద్దోషోపశమార్థినీగిరిసుతాతప్త్వామహోగ్రంతపః
కావేర్యంతరక్లప్తకూపకృతంయల్లింగమారాధ్యసా
పూతాభూదతియేవయోజలమయస్తంబంబుకేశంభజే॥

సీ॥ దేవజగన్నాథదేవేంద్రవందితవితతచారిత్రసంతతపవిత్ర।
హాలాహలాహారయహిరాజకేయూరబాలేందుభూషసద్భక్తపోష।
సర్వలోకాతీతసద్గుణసంఘాతపార్వతీహృదయేశభవవినాశ।
రజతాచలస్థానగజచర్మపరిధానసురవయిరివిధ్వస్తశూలహస్త।
లోకనాయకసద్భక్తలోకవరద।
సురుచిరాకారమునిజనస్తుతివిహార।
భక్తజనమందిరాంగణపారిజాత।
నిన్నునెవ్వడునుతిసేయనేర్చునభవా॥

ఇచ్చటినసంకల్పము శ్రీరంగములోవలెనే చెప్పుదురు
కొందరు కొంచెముభేదముగా చెప్పుదురు

శ్రీజంబుకేశ్వర మహాక్షేత్రము
సంపూర్ణము.



ఈక్షేత్రంబునందు రామతీర్థము చక్రతీర్థము మొదలగు తీర్థములలో స్నానము జేసిని స్తరంగఘోషమై 3 మైళ్ళదూరమందున్న దర్భాశయనమందు సంకల్పపూర్వకముగా ధనుఃపూజాదికములు జరిగించి స్నానదానాదులు చేసుకొని హిరణ్యశ్రాద్ధము తర్పణము మొదలగునవిగాంచి అచ్చటనే మాధ్యాహ్నికకృత్యములు దీర్చుకొని రాత్రికి బసకు వచ్చెదరు. కొందరు వెంటనే వచ్చి దేవళంబులో వేంచేసియున్న శ్రీజగన్నాథస్వామిని లక్ష్మీనిదర్భశాయియయి నాభికమలమందు బ్రహ్మగల శ్రీరామమూర్తిని హనుమల్లక్ష్మణసహిత శ్రీరామోత్సవవిగ్రహంబులును బూజించుకొని తీర్థప్రసాదములను స్వీకరించి బసకు వత్తురు. యిచ్చట వుత్సవములు భోగరాగాదులను కాలముగా జరుగుచున్నవి, యీదర్భశయనము నవపాషాణంబులు, దేవిపట్టణంబు యీ మూడుస్థలములలో పలనా రాముడవలయము గాగల ప్రదేశమును పుల్లారణ్యమందురు. యిచ్చట సంకల్పములో పుల్లారణ్యమందురు.

నవపాషాణంబుల వివరము.

సముద్రతీరమందలి మంటపము చేరి చక్రతీర్థస్నానపూర్వకంబుగా సంకల్పంబు జెప్పి సేతువునొద్దవలెనే ధనుఃపూజచేసి ప్రార్థించి సాధారణపు చెరువువలెని స్తరంగమైక్రమనిమ్నమైన సముద్రములో స్నానముచేసుకొని సముద్రములో మూరెడునీరున్నచోట శ్రీరాములవారు సేతుబంధనారంభమందినుకతో స్థాపించిపూజించిన నవగ్రహసంజ్ఞకలు నవపాషాణములను పూజించి గోధుమాదినవధాన్యములు గ్రహపీడాద్యవధర్మ పరిహారార్థమై నవగ్రహప్రీతిగా యథాశక్తి దక్షిణలతో దానములుచేసి ప్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి తరువాత హిరణ్యశ్రాద్ధాదికములు జరిగించి యచ్చటనే యున్న గణపతి హనుమంతులను దర్శించి యచ్చటికి సమీపమందున్న జగన్నాథస్వామిని లక్ష్మణహనుమత్సహితులయిన శ్రీరాములవారిని సేవించుట విధియై యున్నది, ఇటీవల కొంతకాలంబు క్రిందట నొకచోట త్రవ్వుచుండగా బంచలోహమయమైన శ్రీసీతావిగ్రహము దొరికినందున దానిని జగన్నాథాలయములో శ్రీరాములవారి పార్శ్వమందు ప్రతిష్ఠించిరి, తిలకేశ్వరుడని యొకశివలింగము నొక గుడిలో నున్నది, అదియు సేవింతురు, పై నిర్వాసిన నవగ్రహములను సేవించిన వారికి సర్వగ్రహపీడాపమృత్యుపరిహారమగును.

దర్భశయనము – సంపూర్ణము.



తిరిగి మధురకు చేరవలయును, యిచ్చటనుంచి రైలుమీదుగా తామ్ర పర్ణీతీరమందున్న తిరునెల్వేలి (తిరునల్వేలిలో) ప్రవేశించి ప్రాగ్వాహినిగా నున్న తామ్రపర్ణీమహానదిలో స్నానము జేసి హిరణ్యశ్రాద్ధము మొదల గునవి జరిగించుదురు. నదిలో మంటపములు చష్టాలు ౧౦ గలవు.

పూర్వకాలమందు దూరదేశభక్తుడు తనతల్లిదండ్రులయస్థికలు కాశీగంగలో వైచుటకు గా బయిలుదేరి దేహాశక్తతయు ద్రవ్యాశక్తతయు గలిగి పోజాలక చాలాకించబడి ధ్యానించుచుండగా గంగ స్వప్నరాత్రియందు భక్తునా నీవీ తామ్రపర్ణీనదీతీరమందే నిల్వుము, నేనువచ్చి నీవు తెచ్చినయస్థికలను స్వీకరింతునని స్వప్నమందు చెప్పగా వాడట్లనే నిల్చి నిరీక్షించుచుండగా గంగ తామ్రపర్ణీలో మిళితముగ వచ్చి ఈభక్తుడున్న చోట ప్రవాహమధ్యమునుండి కంకణముద్రికాలంకృతమైన తనచేతిలో వాడు తెచ్చినయస్థికలను స్వకీయముగా స్వీకరించి నేటినుండి యీ నెవ్వరస్థికలనీ తామ్రపర్ణీలో వయితురో వారిపితృదేవతలును వారును శాశ్వతపదవినొందుదురు. యు నేనిందు సన్నిహితరాలనై యుందునని యుగంగయానతిచ్చెనట, కావున నేటివరకు సదాచారమై యున్నదనియు యిటులస్థలపురాణములో నున్నదనియు నిచ్చటిపెద్దలనిరి.

శ్రీగంగామాహాత్మ్యమ్.

౧ గంగామాహాత్మ్యమాఖ్యాస్యే సేవ్యానాభుక్తిముక్తిదా
యేషాంమధ్యేయాతిగంగా తేదేశాపావనావరాః॥

౨ గతిగంగాతుభూతానాంగతిమన్వేషతాంసదా
గంగాతాదయతేచోభావంశానిత్యంహిసేవితా॥

౩ చాంద్రాయణసహస్రాచ్చగంగాంభఃపానముత్తమం
గంగాంమాసంతుసంసేవ్యసర్వయజ్ఞఫలంలభేత్ ॥

౪ ఏకలాఘహరీదేవిస్వర్గలోకప్రదాయినీ
యావదస్థిచగంగాయాంతావత్స్వర్గేసతిష్ఠతి॥

౫ అస్థాదయస్తుతాంసేవ్యదేవయుగచ్ఛంతితుల్యతాం
గంగాతీర్థసముద్భూతమృద్ధారీసోఘహార్కవత్ ॥

౬ దర్శనాత్స్పర్శనాత్పానాత్తథాగంగేతికీర్తనాత్
పునాతిపుణ్యాపురుషాంచతశోథసహస్రశః॥
ఇత్యాదిమహిమాస్పదంబై యున్నది॥

తామ్రపర్ణీ - సంపూర్ణము.

